ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము—సంఖ్య—౨౨

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

—। ద్వితీయభాగము ।—



అహోబలపతిపండితప్రణీతము.

(పరిషత్పత్రికనుండి పునర్ముద్రితము)

---

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

1929.

వెల రు 0-8-0.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగపీఠిక.

---

ఈమహాప్రబంధమునకుఁ గర్త యగుమహాబలపతి జన్మదేశాదు లగు సామాన్యవిషయములం గూర్చి ప్రథమభాగపీఠికలో ముచ్చటించితిని. ఇంక నిపు డిందుఁ గలవిశేషములను వివరించెదను. ఈభాగమున ౪-౫-౬ ఆశ్వాసములు గలవు. అందు నాల్గవయాశ్వాసమున నాముక్తమాల్యదాది కాంధ్రప్రబంధరత్నములందు వలెను గిరాతార్జునీయాది సంస్కృతకావ్యములందు వలెను ఋతువర్ణనము మంచిమంచి కల్పనలతోను గొప్పగొప్ప భావములతోను జేయంబడినది. చూడుఁడు :—

— వసంతవర్ణనము —

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమమహిమచే నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపుల కింపైనఫలములు చేకూర్పఁగలుగువాఁడు
బలుజడిచే నైనయలజడి సహియించుమానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేవయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌష్ఠవైక, మూలకారణ మైనట్టిమేలువాఁడు
మాధవుఁడువచ్చెనవ్వేళమధురలీల, వనరమాంగనయామోదమున మెలంగ.

సీ. పంజరగుహాలలోపల నున్కి గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబుగానక గాసిల్లు మానిసంఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వరహంసవారములను
నలరుసీ రక్కడ నక్కడఁ ద్రావుచు వసియించుచేతనవ్రాతములను
సత్పరిగ్రహలాభంబు సంభవిల్ల, నురుతరామోద మందెడు యోగితతుల
మన్నన మొనర్చెఁ దావచ్చిమాధవుండు, కామితార్థంబులవ్వారిగాఁగనిచ్చి.

ఇందలిశ్లేషవిశేష మెంతచక్కనిదో!

— గ్రీష్మవర్ణనము —

గీ. కూటిపేదలేకంబు గైకొనిరి మిగుల, నాతరముచేత బ్రతికెడునట్టివారు
ఖననమొనరించితనుయాత్రగడపువారు, కూలిగలుగుటనవ్వేళ గూఁటఁబడిరి.

క. కూటిరుచి పాన మొందెను, బొటిల్లెను నీళ్ల సుళ్లు పవనంబునకున్
మేటి సురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. ౩౭

ఈ రెంటియందును స్వభావోక్తి చక్కఁగ వర్ణింపఁబడినది.

క. పడమటిసెక నుదుకఁగఁబడి, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడుఁబూతం బనుచు వానిఁ గర్మారంభుల్. ౮౮

ఇం దాచారసంప్రదాయము కలదు.

—। వర్షర్తువర్ణనము ।—

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానర రక్షయేకార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రిభోజనం బెచ్చట నన్నమాత్రము కాని యబ్బదయ్యె
పౌరమంత్రోపాస్తిచతురుల కశనంబు నార్ద్రగట్టుట గానివావి యయ్యెఁ
బ్రతిగృహాంబున కేగిప్రార్థింపఁ (ప్రార్థింప)భిక్షయొకింతొసఁగినఁ జిత్రమయ్యె
జంబుగూడలకలుములు డంబుమిగిలెఁ, గతకసంపాదనంబులు ఘనతగాంచె
నన్నదాతకు నేనియు నతిథి కొకని,కైన నన్నంబు గల దను టరిదియయ్యె.

ఇది యాముక్తమాల్యదఛాయ—

“ఇల్లిల్లుఁ దిరుగ నోర్కొంతబ్బు శిక్ష; యబ్బనే నింటిలోఁ బూరి యిడివిసరకి
రాఁజదు; రాఁజిన రవులుకోల్వాపాలఁ గాని కల్గదు; మఱి దానఁ గలిగె
నేని కూడగుట మంచైనఁ బెన్బాగ సుఖభుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాగ్భుక్తలకతీఱు బహుజనాన్నము; దీఱ నారులకొదవుఁ బునఃప్రయత్న
మాజ్యపటముఖ్యలయ మెన్న; రాలయాంగ
దారులయ మెన్న రంతిక; కారజనిక
పచన నాంధ్రగృహిణి రామిఁ బడుక మరుఁడు
పెడపెడనె యార్ప నొగిలి రజ్జడిని గృహులు.”

ఉ. కాలువలెల్ల బల్లదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలియొనర్పఁగాఁ గడఁగెఁ గేవల మబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతిసందక యుండు వికారహేతువుల్
చాల మెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౫౭

ఈ దలి యర్థాంతరన్యాసము మహాకవికాళిదాసుని కుమారసంభవములోని
“వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరా” అను
శ్లోకమునుండి గ్రహింపఁబడినది.

కవు లిట్టి మనోహరము లగుకల్పనలను భావములను బద్యభాగాదులను దత్తద్భావతత్పరులై యనుకరించుచున్నారు. దానిని నసమర్థతచేఁ జేసిన గ్రంథచౌర్య మనరాదు.

—। శరదృతువర్ణనము ।—

క. జీవన మాతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి నడపి మై
కేవలఫలితంబుగఁ దాఁ, బోవదె ఘనపాళి యక్షపుంగవు దిశకున్. ౯౭

ఇందుఁ భారతీయులకుఁ బరమపురుషార్థసాధన మగు మహాప్రస్థానము సూచితము-

—। హేమంతర్తువర్ణనము ।—

ఉ. తప్పులదాయ మేర్పడఁగఁ దాళక తప్పులనేఁచ మాచుచి
చ్చుప్పరియాద మీఱ వడిఁజొన్పఁగఁ దప్పులతోడ నార్తస
ఖ్యప్పు భరించు కల్వలును గాఱియఁజెందెను మిత్రవర్గమూ
తప్పు నెఱుంగఁ డయ్యె నుచితస్థితిఁ గాంచ జనుండు నేర్పునే. ౧౦౬

ఇందలి యర్థాంతరన్యాసము సర్వకాలములందును సర్వజనులకు ననుభవసిద్ధమైనది.

—। శిశిరర్తువర్ణనము । –

ఉ. శీతముచేత బాధపడు చిజ్జగంబు భరింపఁగా జగ
త్త్రాత దినేశుఁ డీశ్వరతఁ దాల్చును నంబరమధ్యసీమఁ దాఁ
జాతురినేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్నీతము చేసెఁ గావలయు నెవ్వియుఁ ఘుట్టిల్ల హరించుశీతమున్. ౧౧౬

ఇందలిప్రభావ మెంతబాగుగనున్నదో! మఱియు నీభావము, "బ్రహ్మస్వరూప ముదయే, మధ్యాహ్నేతు మహేశ్వరమ్, సాయంకాలే సదా విష్ణుః త్రిమూర్తిర్హి దివాకరః" అను శ్లోకభావమూలకము.

క. అప్పప్ప యేరికైనను, జెప్పంగాశక్యమానె శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించున్. ౧౨౦

చూచితిరా యతిశయోక్తి మహిమ!

(2) పంచమాశ్వాసమున- శ్రీకృష్ణుఁడు ధర్మరాజును జూడఁబోయి యర్జునునితోఁ గలిసి యమునానదీతీరమునకు వేఁట కేఁగి యటఁ దనకై తపము చేయుచున్న కాళిందిం జూచి యామెను దనపురమునకుఁ దీసికొనిపోయి వివా

హము చేసికొనియె ననుకథ సహృదయ హృదయాహ్లాదకములైన రసగంభీరకల్పనావిశేషముగల నాటయగునది గద్యపద్యములతోఁ జక్కఁగ వర్ణింపఁబడినది. చిత్తగింపుఁడు.

ఇంద్రప్రస్థవర్ణనాసందర్భమున నీవిద్వత్కవి తనకుఁ బరిపూర్ణప్రజ్ఞగల యష్టభాషావిశేషము నెట్లుచూపెనో :

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు వ్యత్యయకార్యోపపత్త్యనుగత
మనుస్మృతభవికలాపాయోగసిద్ధంబు శేషోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణనిరూఢంబు సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చష్టభాషావిశేష, సముదయస్ఫూర్తి హసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందముగఁ గాంచె నచ్యుతుండు.

ధర్మజునిభక్తిగౌరవము లెట్లు చిత్రించెనో చూడుఁడు-

గీ. జలజనయన యిహాముత్రఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీపదభక్తిఁ జేకొని నిలిచినాఁడ, నితరము నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుప, నీవకా కన్యదేవత నేర్చు గనదు
దురితసంహారజగతి ఖద్యోతు మహిమ, యొరులు నేరీతిఁ దలఁపఖద్యోతమునకు.

ఈవిద్వత్కవి తన శాస్త్రీయజ్ఞానమును 17 వ పద్యమునఁ గాళిందీతీర కాంతారమును మీమాంసా తర్క వ్యాకరణ చ్ఛందో లంకార భరతశాస్త్రములతోను బ్రాకృత త్రిలింగభాషలతోను నుత్తమ కావ్యంబుతోను శ్లేషించి పోల్చి చూపెను. శ్రీకృష్ణుని వివాహసందర్భమును 73వ పద్యములో నాదబ్రహ్మమును నిరూపించెను.

"మంచిభోజనము" అను 140 పద్యమున హాస్యరసలవము.

"పగలుగావించు"నను 155 పద్యములో నప్పగింతలలోఁ బిల్లలు పెద్దలందున్నగుణము గ్రహియింపవలయును గాని పెద్దలందు దోష మున్నను గ్రహింపరా దనునీతి చక్కఁగా బోధింపఁబడినది.

(3) ఇఁక షష్ఠాశ్వాసము.

ఇందుఁ గాళిందీకృష్ణుల సరససల్లాపములు వర్ణింపఁబడినవి. కాని నాగరకులకు వెగటుగల్గించు మోటువర్ణనము లెందును లేవు. ఇంతియే కాదు, కేవలశృంగారప్రధానము లగుపట్టులందుఁ గూడ నీవిద్వత్కవి యావిషయమును

దనశ్లేషమహిమచేఁ గావ్యములతోను శాస్త్రములతోను నాగమములతోను సంస్కృతప్రాకృతాంధ్రభాషలతోను మూలప్రకృతి (అవిద్య)తోను బరబ్రహ్మముతోను బోల్చి చదువరుల డెందములం దనాదిపరమసిద్ధాంతముల నాటును. వీనికిఁ బూర్వభాగమునందుఁగూడఁ జాల నుదాహరణములు గలవు.

41 వ "కామితిమేమియుక్" అనుపద్యములో "సర్వత్ర జయ మన్విచ్ఛేత్పుత్రా దిచ్ఛేత్పరాజయు" మ్మనుదాని భావము గలదు.

"హృదయగ్రంధి" యను 42 వ పద్యములో "భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తేసర్వసంశయాః, తస్మిన్ దృష్టే పరావరా"అను నుపనిషత్సారము నిమిడించెను.

"నేరుపుమీఱు" అను 49వ పద్యములో శృంగారరసము నలు పను సంప్రదాయము తెలియఁజేయఁబడినది.

56 క్రొమ్ముడి యుత్తమనిబంధము (కావ్యము)

60 కబరి యుత్తమకావ్యముం బోలును.

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁదేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనాభాషితద్వి
రేఫవైఖరిగలిగిత్రిలింగదేశ, సూక్తియనవొప్పుఁగస్తూరిచుక్కబొట్టు. 67

ఇందుఁ గస్తురి చుక్కబొట్టు ప్రాకృతత్రిలింగభాషలవలె నున్నది.

70 చవ్రుతిచందురుఁజూచిన సీలాపనిందవచ్చును.

86 కార్యసాధనవిధానము మంచి దను నీతి బోధింపఁబడినది.

90 "వనిత యరగన్ను" అనుదానిలోఁ దపము (నిరంతరదీక్ష) బలిమిని గార్యసిద్ధిని గలిగించు ననునుత్తమసిద్ధాంతము.

97 "వాగ్భూషణంభూషణం'' అనుదాని యభిప్రాయము.

113 లజ్జ నవిద్యతోఁ బోల్చి గురూపదేశమున నవిద్య నశించు నను మహాభావము స్ఫురింపఁజేసెను.

124 "సాంజనాతి"—ఇందుశబ్దచిత్ర మయిన యమకము.

138 "బ్రహ్మ మననొప్పు"—అద్వైతసిద్ధాంతము. చూచితిరా శ్లేషమహిమ ! అతిశృంగారములోనుండి మహావేదాంతమునకుఁ గొనిపోయినది.

145 ''గరితబింబోష్ఠి''—ఇందుఁ గల్పనావిశేషము.

151 "మృదుపదమై''—282 "సుప్రసాదత"- ఇందు రసావహమైనచో దోషము గూడ గుణమగు ననుకవిభావము తోఁచుచున్నది.

**163, 236** గగనకుసుమము-అప్రసిద్ధ మని తార్కికుల సంప్రదాయము.

174 "పయోధరమండలము" అను శ్లేషరూపక మహిమచే వర్షాకాలము ప్రత్యక్ష మగుచున్నది.

176 త్రివేణీస్నానమున ననంతసౌఖ్యముకలుగు నను పౌరాణిక భావము.

188 తపముచే నణిమాదిసిద్ధులు గలుగును.

191 ఆత్మస్వరూపమును శైలుపఋషువిధాన మతినిపుణముగా నిరూపింపఁబడెను.

197 గురుశుశ్రూష పరమసుఖంబు.

202 రూపకమహిమ మిందుఁ గలదు.

223 ఈపద్యమునందు (అహిభయము) స్వపక్షభయము గలరాజురాజ్యము క్షీణించు నని చూపఁబడినది.

229 బ్రహ్మతత్వము.

230 భగవంతుఁడు సర్వద్రష్ట.

241 భగవంతునిదర్శనమైనపుడు సర్వహృదయగ్రంథులు వీడిపోవును.

270 ఈగద్యము ప్రథమాశ్వాసములోని "వెండియుజగజ్జనాది" అను పెద్దగద్యమువంటిది. ఒకపి శేషము—అం దర్థాలంకారములే గలవు. ఇందుఁ గొన్ని శబ్దాలంకారములును గలవు, కుండలిబంధము, నాగపద్మబంధము, మాలికా బంధము నిట్లు "నానాలంకారలీలామూలాస్పదంబై తనరు."

మొత్తముమీఁద నీమహాప్రబంధమున శృంగారరసము ప్రధానము. మిగిలినవి యంగములుగా నవసరోచిత్యానుసారముగా నిరూపింపఁబడినవి. కదళీపాకము ప్రాయికము. అక్కడక్కడ నారికేళపాకము గూడఁ గలదు. శైలి లక్షణలక్షితము. గుణాలంకారము లత్యంతమనోహరములు. రీతివృత్తులు రసానుగుణంబులు. భావంబు లతిగంభీరంబులు. అనర్గళ మగుకవితాధార. దానికిం బదిరెట్లు వేదవేదాంతసంస్కృతప్రాకృతాంధ్ర వ్యాకరణతర్కమీమాంసాలంకారాది సకలశాస్త్రసర్వతోముఖపాండిత్యమహిమ. దానికి నూఱురెట్లు శ్లేషచమత్కారము. విద్వత్కవి రచించిన యీమహాకావ్యమునందలి భావములు సుబోధము లగుటకు విపుల మగువ్యాఖ్యాన మపేక్షణీయము. మనయాంధ్రసాహిత్యపరిషత్తువారు తగినయత్న మొనరించి వ్యాఖ్యానము చేయించి ప్రకటింపఁ గడంగుదురు గాక! మూలమూలల నున్నయిట్టి

మహాగ్రంథములను సంపాదించి ప్రకటించి కవులకీర్తులను జిరస్థాయులుగాఁ జేయుచున్న యీపరిషత్తువారికి జగత్కారణం బైన శివకేశవాది నామములచే భావింపఁబడు పరబ్రహ్మము దీర్ఘాయురారోగ్యైశ్వర్యజ్ఞానసంపదభివృద్ధులను జగదుపకారకృత్యనిరంతరదీక్షాదక్షతల నిచ్చుఁగాక !

గీ. చిలుకపలుకులు చెవులకుఁ జెలువుగొలుపు
నట్లు దక్షిణవాక్యము లాత్మతృప్తి
నందఁజేసెడు నీకు నారాయణాత్మ
ముదముగన లోకబుధులు ప్రమోదరూప !

ప్రమోదదక్షిణాయనము,
పిఠాపురము,

శ్రీపాద పాపయ్యశాస్త్రి,
శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థాన
పండితుఁడు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

— విషయసూచిక — పుటలు.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## ద్వితీయభాగము.

---

### — చతుర్థాశ్వాసము —

క. శ్రీమద్భార్గవరామవి, రామశరణ్యోరుధామ రమ్యభుజబలో
ద్దామాభిరామ నుతసు,త్రామా సాకేతధామ దశరథరామా. ౧

వ. మహాత్మా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

### —॥ వసంతర్తువర్ణనము ॥—

క. అంతట విమలక్షీరత, సంతతసుమనఃకదంబసంజీవనతం
బొంతె సురభికి మిక్కిలి, వింతె *యేతెంచె సురభి విరహులు † బెగడన్.

గీ. ఉదయరాగచ్ఛదంబు మై నూనికొనఁగఁ, దలఁచి వనలక్ష్మి జీర్ణచ్ఛదంబువిడిచె
మాధవునిరాక కని వృక్షమండలంబు, దాల్పఁగనుబట్టుజీర్ణచ్ఛదంబు‡రాలె.

సీ. నిఖిలాగమాంతనిర్నిద్రశోభ నొసంగు నిరుపమసుహిమచే § నెసఁగువాఁడు
శుకముఖద్విజరాజిచూపులకింపైనఫలములు చేకూర్పఁ గలుగువాఁడు
బలుజడిచేనైనయలజడి సహియించు మానుల మధురోక్తి మనుచువాఁడు
తెలిపువ్వునీటిచే దేహయాత్ర ఘటించు మాధుకరశ్రేణి మంచువాఁడు
సాధుసుమనోనిరంతరసౌఖ్యవైక, మూలకారణమైనట్టి మేలువాఁడు
మాధవుఁడు వచ్చె నవ్వేళ మధురలీల, వనరమాంగనయామోదమునమెలంగ

సీ. తనరు దక్షిణజగత్ప్రాణున కేవేళఁ జెడని మాంద్యగుణంబు సేయుకతన
నతిరక్తపల్లవప్రతతి వర్ధిలఁజేయు నభ్యుదయంబుచే నడరుకతన
నఖలనిస్సంగుల నాయాసపడఁజేయు నీలదేహుల కుక్తి నేర్పుకతన
సురుచిరాకృతి జాతిసుమనోవిలాసంబు కొదవకు నొడిగట్టుకొన్నకతన
నప్రసాదత కాటపట్టైనకతన, నధికసాంద్రరజోవ్యాప్తి నందుకతనఁ
గలుగునయశోవితానంబు కిరణిగనుచు, నఘులుచరియించునామనినాళిగనుచు.

చ. అలరులచే జగద్విజయ మందె మరుం డన యుక్తి భూషకుం
గలుగును లక్ష్యమన్న నది గాదు జగజ్జయసాధనంబులై
మెలఁగెడు చాపబాణములు మేలుగ నిర్మితి చేసి మాధవుం
డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్యమా. ౭

---

* యేతెంచు.-మూ. † పొగడన్ మూ. ‡ వాలె? § నెగడువాఁడు.-అనుటమంచిది.

మ. ధరఁ బాదంబులు నాటి ప్రాఁకుడుచు వంధ్యత్వంబు పోఁగోరి య
త్తరురాజు ల్గడు మాధవుం గొలువఁగాఁ దద్వంధ్యతోత్సాదన
స్ఫురణోద్యత్ప్రసవాభిరామఫలసంభూతు ల్ఘటింపించు త
త్తర(ర)దత్తారుణమంత్రితాక్షత లనం గానంగనయ్యె న్ననల్. ౮

క. ఫలగర్భిత గొను లతికా, కలకంఠకులకుసుమగుచ్ఛఘనపక్షోజం
బుల మిగుల నొప్పు గైకొను, నలిశోచిశ్శ్యామచూచుకాంచితరోచుల్. ౯

గీ. వంబురసమునసుమనఃకదంబకంబు, కాలగతి(?)దువ్వుక కాంతలఁ జాలఁగూడెఁ
దత్సమాయాతమైనపాతకముకతన, విరిసెఁ గాఁబోలు నన నద్ది విరియుచుండెఁ.

చ. అరయఁగఁ బుష్పవత్యభిధ నంటి రజోవతు లన్న పేరిచేఁ
బరఁగులతాలతాంగులయభంగురసంగతిఁ బొంగి సమ్మద
స్ఫురితనినాదము ల్గొనుట చోద్యమె మత్తమధువ్రతాళికిం
గర మురవైన యవ్వృజినకాళిమ మేనున నంట నబ్రమే. ౧౧

క. గిఱికపడి కొనలు సాఁగక, యొఱలులతాంగనలఁ బెనిచి యొప్పఁగఁ బుష్పం
బఱఁ బువ్వు మొగ్గగుబ్బలు, వఱల ఫలం బెసంగఁ జేసె వలపుబుతు వొగిన్.

క. మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతి యొసఁగు సర్వాగమముల్
మాధవవిభవముఁ దెల్పుచు, సాధుకవిప్రీతిదములు సర్వాగమముల్. ౧౩

క. మును వృద్ధికి ఘనులొసఁగిన, ఘనఋణ మొగిఁ దీర్పఁ దరులు కప్రసుమపుటం
బునఁ బొదిగి ఋణముఁ దీర్చెను, గనదళిదంభంబు దాల్చుఘనదూతలకున్.

గీ. బంధురము లైనయలవనస్పతుల కెల్ల, సౌమనస్యంబు విఘటిల్ల భూమిజాత
భావమాకులపాటొందఁ బరఁగు*మర్త్య, శంబు నానటమధువ్రజంబు మిగిలె

చ. వరవనమాలికాకలితవాసన లూనుచు మాధవీమనో
హరరుచి కాస్పదం బగుచు నాత్మపరాగముఁడై కుజాతివి
స్ఫురణము మాన వర్తిలుచు భూరికవిప్రజమాననీయుఁడై
పరఁగెను మాధవుం డపుడు భవ్యఘనాకృతి మాధవాకృతిన్. ౧౬

గీ. రోగుల భరించి యఁచక్రయుక్తి మించి, భోగిసంసేవితాకృతిస్ఫూర్తి గాంచి
మాధవుఁడు మాధవుండగు మాదిఁ దలంప, నలయ పాంసులతాగుణం బరుదుగాని

సీ. పంజరగుహాలలోపల నున్నఁ గైకొని శర్కర మెక్కెడు జంతువితతి
నతివృష్టి కోరిచి యశనంబు గానక గాసిల్లు ఘూనినఁ ఘాతములను
సరసులలో నుండి జలవాసవృత్తిచే వర్తిల్లు వరహంసవారములను
నలరునీ రక్కడనక్కడఁ ద్రావుచు వసియించు చేతనవ్రాతములను

*ధుర్యశంబనా-మూ.

నశ్వరిగ్రహాలాభంబు సంభవిల్ల, నుగుతరామోద మందెను యోగితతుల
మన్ననయొనర్చెఁ దావచ్చి మాధవుండు, కామితార్థంబు లవ్వారి కొసఁగవిచ్చి.

గీ. దీర్ఘవిశ్రుతశబ్దవృత్తిప్రకాశ, మాశ్రితానందితమాధుర్య మధికతప్ర
సాదమై యొప్పెనపుడు వసంతఋతువు, మహితకావ్యప్రకాశకృన్నతముపోలె.

క. పల్లవపేశలశయ్యా, వేల్లక్రీతులకుఁ దనిసి విపులధ్వనులం
బెల్లెనయుచుఁ బుంస్కోకిల, తల్లజులు వసంతవేళఁ దనరిరి మిగులన్. ౧౦

చ. తెలిపువుసీటివర్షము లుదీర్ణములై యొనరంగ నత్తఱిన్
మలయుఁగఁ జొచ్చెఁ బుష్పడిపుమారము లెల్లెడల న్నిరంతరా
కలనవహించి దట్టముఁ గానఁగనయ్యెను యోగదూరతం
గలఁగెడు దంపతిప్రతతి గాంచుచు హామ్మపుఁగావ్యగాడ్పులున్. ౧౧

సీ. ఉవిదపుక్కిట సుర యుమిసిన నొక్కఁడుతరువు పాదాబ్జఘాతమున నొకటి
చెట్టు, వేఱొక్కటి తిట్టుచు డాసిన నామోదసంపద నంది వెలయ
ముద్దుల నగవుల మురిపెంపుఁ బాటలఁ గౌగిలింతలఁ బ్రేమఁ గనుఁగొనుటల
నడుగుట నూర్పుట హస్తసంస్పర్శలఁ గొన్నిమహీజముల్ చెన్నుగొనియె
నవనియందు నచేతనతామభూతి, గనినవృక్షము లిం కామినీసుఖితగార
వావమానంబులొకటిగా నలరరసికు, లలరుటెంతయు హాయివింతయతివపొంతఁ.

గీ. చెలువుమీఱినయవ్వేళఁ జిత్రమొకవ, నమ్మి గైకొన మెలఁగెడునమ్మిరొదలు
నెపుడుఁ బాయువిశ్వైహాత్యమిరవుకొన్న, యట్టివయ్యును సాహాత్య మాశ్రయించె.

సీ. అరసానుభూతుల సరసానుభూతులై మెలఁగుచుండఁగఁ జేయు మేలుశక్తి
లేఁగొమ్మపొంకులు లేకయుండెడువానిఁ దద్వృత్తనాదింపఁ దనరునేర్పుఁ
బ్రసవవాసనలేక బడలుచుండెడువానిఁ బ్రసవాప్తినమరించు ప్రబలమహిమ
పల్లులింపులు మీఱఁ బలుకనేరనివానిఁ బలుకదిద్దినయట్టి పాటవంబుఁ
గలిగినవయోగిజనములఁ గడుముదమున, నెనయఁ జేయువసంతయోగీంద్రుఁ గన్న
యోగరహితజనంబులయుల్లములను, బెల్లువర్తిల్లకుండునె పల్లటములు.

క. సురభీరయమార్గచరా, స్థిరమాశన నమ్మదశ్రుతే గ్భవతి కుహూ
పరిహార్తా నేత్యేవం, పరవాక్కుల నవిరళముగఁ బలుకుం బికముల్. (?) ౧౨

ఉ. పంకజకోశపుష్పపుటభాసిమిళిందగిలానవాసనై
యంకురసూచికావినిహతాహితమండలజీవితంబునై
శంకిలఁజేయు నాభిరతశాస్త్రము నామని దానిజూడఁగా
నంకురమూను మోదభర మవ్యనిరీక్షణఁ గల్గ నేర్చునే. ౧౩

## —♦ గ్రీష్మఋతువర్ణనము ♦—

క. అంతట వేసవి దోఁచెను, రంతమహోష్మానుగతనిరంతరమిథ్యా
దంతాభ్యర్హితమతద్భ, ష్మాంతమరీచీవిమాలితాశాంతంబై. ౨౭

క. వరసుమనోజీవితమగు, సురభిం బఱుపంగ భువనశోషకతిగ్మా
కరకనుజుఁడు వడిగఁ దదా, కరవిపినంబులనుమిగులఁ గాఁక దహించెన్. ౨౮

క. ఆమెడ దక్షిణదిగ్భవ, వాయుపదత్రయికి నెన్న వరుణాలయది
గ్వాయువు సపాదసప్తా, ధ్యాయియనం దగు నటంచు నడరు న్నుడువుల్.

మ. ప్రతికూలుం డగుచంద్రుఁ గూడి విరహివ్రాతంబు నేఁచంగనో
యతిగాఢచ్ఛదశాఖతా వనుల ధ్వాంతారాతి డాపంగనో
యతికోపోగ్రత నవ్వసంతునయుఁ దా నందెం జుమీ నాఁ బదా
హతి దూరోష్మత లోకబాంధవుని యుం దారూఢమై వర్తిలెన్. 3౦

మ. నతవాహంబులు మచ్చరం బొదవఁగా నప్తాశ్వము న్వోటన
ప్రతిమం బా రథమూన వంతిడఁగ నాభావంబుచే శీఘ్రపుం
గతి నయ్యశ్వము గాంచలేమి జడియుం గాంచెం బ్రయాణంబు భా
వతికిన్ నా దివసంబు లాయతము లై పాటిల్లె నవ్వేసవిన్. 3౧

సీ. నాదగు దాహగుణంబు కారణగుణప్రాప్తంబుగా జగత్ప్రాణుచాహ
సక్తినంపత్తికి సంశయింపఁ బనేమి నీమఁ డొక్కఁడు గంధనిలయగోత్ర
మందితద్ధర్మంబుఁ జెంది స్వధర్మంబు విడిచిన నేఁ బోవ వినుతు నెట్లు
జడత గైకొనుట నే జలముతో మైత్రికిఁ జొరఁ జిమ్ము హరియింతు శరధిఁ జొచ్చి
యనుచుఁ బశ్చిమజలనిధియందు మెలఁగు, భీకరాటోపబడబాగ్ని వెడలె ననఁగ
నఖిలజనములు భీతి నిట్టట్లు గాఁగఁ, బట్టుచాలక వడముటివెట్ల దోఁచె. 3౨

క. పుడమి విరియంగఁ గొలుకుల, తడి కొలఁకులతడులతోడఁ దరలఁగ జంతుల్
కడు బడలి నీళ్లగాళ్లం, బడి గొంతులువడుప మాడ్చు(?)పడమరసాగెన్. 33

సీ. బలిసెను బహుదూరపదవి ప్రపలతోడ భూరిసరిన్నధ్యపులినవితతి
యొండసాగెను మార్గగేహితకూపంబు లమితపాంథాళికంఠములతోడ
దీర్ఘత గైకొన దినములు మతిమతి యతిపృథజలరజ్జుతతులతోడ
మించెను మిత్త్రోపలాంచదగ్నిశిఖాళి చటులబడవానలచ్ఛటలతోడ
సంతతాన్నప్రదాతకు సాధుకర్త, శీలునకు నీళ్లవలవలు సేయవలసె
నతులపశువృద్ధి గలిగిన యట్టివాని, కైన నర్థాంబు వబ్బుట యరిదియయ్యె.

గీ. కూటిపేదటికంబు గైకొనిరి మిగుల, నాతరము చేత బ్రతికెడునట్టివారు
ఖననమొనరించితనుయాత్ర గడుపువారు, కూలిగలుగుటనవ్వేళ గూటఁబడిరి

గీ. తల్లి *పదమునందు ధార్మికమనముల, (సుకవి)కవితయందు సొబగుమిగులు
గుబ్బలాండ్ర పీనకుచమధ్యసీమల, నిలుచు శైత్య మనుచు నిలుచు బుద్ధి.

క. కూటిరుచి పానమొందెడు, బాటిల్లెడు నీళ్ళనుప్పు పవనంబునకున్
మేటిసురతములకూరిమి, గాటపుటుపగూహనములఁ గదలక నిలిచెన్. ౩౭

గీ. చూడకయుఁ జూచికొన్నింటిపిడనాడి, యనసి యొకకొన్ని నూపంబులాఁగికొను
చుఁ, బురుషు లింతులు వేర్వేఱ బురదపేరు, కడన వెలితిగఁ గైకొనికనుబడలిరి.

క. హారఘనోద్ధతవహ్నినె, తిరుగంగ్రాఁపంగఁ దలఁచి దీపించె నటం
చురవడి వెట్టకు వెఱపుచు, మరుఁ డురుకుచశిశిరమున్గ మున్నయుఁ జేరెన్.

క. బలుబీటలవెంబడిఁ జనఁ, గల (జల)జంతువులు మొనటఁగల పదనంబుల్
జెలువబలుగుబ్బ చలువల, నెలవుగఁ గైకొను మగంటు నేర్పున బ్రతికెన్.

సీ. ఇనుఁడు దాక్షిణ్యంబు నెనసి మర్త్యలోకభాంధవుఁడనఁదగి యనుద్ధతకరత్వ
మనువుగఁ దనకు జీవనసిద్ధి గావింపఁ దనుఁగోనిజాంశునంతతులకోడ
ముదము గైకొనె నదీనదము లంతటఁ గాలగతిచేత నత్యుగ్రకరతఁ బూని
యతఁడు దాక్షిణ్యంబు గతముగా దినదినంబును వాస్తవస్తజీవనము నెల్ల
గాఁకఁ గైకొన జంతుబాఁకటికి లేక, నలమలనుమాఁడఖిన్నతగలయుఁగ్రమ్మ
నందఱుల్లంఘనముసేయనమితగంక, భావమొదవంగనెంతయుబయటఁబడియె.

క. పట్టపగలెనయుభానుఁడు, బెట్టుగ గాఁకల జగంబు బెదరింపఁ హారుం
డట్టియెడఁ గాన నెకక, న్దట్టపుజికి నొఱపె ననెడుకలఁ పునయించెన్. ౪౨

గీ. పవలధఃకృతరేధభావప్రచండ, ఘనవహనవృత్తి దీక్షితాచటులమగుచు
దివ్యతేజోగుణంబున దీప్తిగాంచి, సువిశృతిరీతిఁ గనవయ్యెఁ జూపరులకు.

క. వడమటినెక నుదుకఁగఁబడు, పిడికిటివస్త్రంబు లెల్ల బెట్టాఱంగాఁ
గుడికరమునందు నిలిపిరి, కడు బూతం బనుచు వానిఁ గస్తారూధుల్. ౪౪

గీ. చిత్రచిత్రరుచివ్యాప్తిఁ జెందియరస, భావవిత్యాస్పదంబని పలుకఁ దగుచు
భీకరనిదాఘసమయంబు పెంపుగొనియె, జరమకావ్యంబుగొన్న సౌష్ఠవముగాంచి

క. పంకరుహజాండభాండము, పంకజహితతిగ్మకాంతి పటువహ్నిశిఖా
బొంకమలగ్రాఁగునపటిని, రంకుశధూమంబనం బరాగము వొడమెన్. ౪౬

*పఠన సునఁదుడు. యూ.

గీ. భూరిరవిరోధిఁ గాలెడు పుడమి వేడఁద, పెనము పైఁ బంచు వెన్నెలపేరి యట్టు
మాటిమాటికి నయోఁకటను జేయు మతి యుఁ బొట్టునిండించె రేతేని పుడు ముఁ గుఁడు టుము

చ. ఖరకరయుక్తప్త దృఢకంజభవాండఘటాంతరంబునం
గరము మెలంగి క్రాఁగుచున్న కాంతవిభామృతముం జకోరముల్
పరఁగు(గుటా)గుటాల్కఁటులఁ బానము చేసెను నోరు పొక్కఁగాఁ
బక మధురక్తిమై మిగులఁ బాటిపడప్పికి వేఁడి వాఁడియే ౪౭

గీ. అతులమాధుర్యమకలంకమనుచు విబుధ, సముదయం బెన్న జగతిఁ బ్రశస్తిగాంచు
నక్షతాధృగాదంచన్నవామృతంబు, గ్రోలి సుఖియించెఁ జాలఁ జకోరసు*కవి ౪౮

క. చిమ్మసరి పగటికాఁకల, నిచ్చల జక్కవలు సుఖికనిలిచెను గాఁకల్
హెచ్చెను వెన్నెల వానికి, మచ్చికజవరాండ్రు రేల† యుఖుకవఁ బకటల్

చ. తొలుత హిమాంశురాజు రుచితోయము హాప్తకర ప్రకృప్తతన్
మెలఁగెడు చంద్రకాంతముల మీఁదటఁ బర్వ ఛటచ్ఛటార్భటీ
మిళితపుటాపురుల్ దిశల మించెను బిస్ఫుటరాలు మెత్తనై
నిలిచె ద్రవంబుజాలు బలునిర్ఝరముల్ గలిగెన్ గ్రమంబునన్. ౫౧

గీ. చంద్రుఁడమ్యోముదపనుఁడు చక్రవాక, దంపతుల కెల్లనవ్వేళఁ దపనుఁడయ్యెఁ
జందమామయుఁదలఁపనీ చందమునదె, యోగతదభావహేతువులూహితముగ.

క. భోగులకు రాత్రివేళల, బాగుగ రుచియించె మధురపానకరసముల్
బాగై రుచించె నంతకు, బాగా నిజసతుల మోవిపానకరసముల్. ౫౩

ఉ. వేసవిరాత్రులందు నరవిందరిపూపల వారి నిర్ఝరో
ల్లాసముఁ జేసి ప్రోషితవిలాసినవధూ‡గుడివోత్థ బాష్పముల్
గాసిగ వీచునట్టి బలుకాఁకల వారుణదేశవాయువుల్
భాసిలఁ జేయుఁ జాలెఁ దదపారము భోదితతీవ్రవాతముల్. ౫౪

క. వ్యాకోచనమల్లికా కుసు, మాకృతులవ్వేళఁ గానవయ్యెను జంద్రా
లోకపరిలీన మగుచున్, వ్యాకీర్ణోదీర్ణపరిమళాచితము హిమున్. ౫౫

—♦ వర్షఋతువర్ణనము ♦—

గీ. అమితభూతాపవినివారణాశ్రయంబు, భువనసస్యౌఘసంతతసూర్తిబీజ
మార్తచాతకసంజీవనౌషధంబు, నంతఁ గృష్ణాభ్రము ప్రకాశ మధిగమించె.

క. తనబలు జీవనధనములు, గొని జగముల నేఁచు గ్రీష్మఘోరాసురునిం
దునుమాడ నెత్తె వరుణుఁడు, ధను వన నపరాశ నింద్రధను వుదయించెన్.

*కవిశబ్దము పక్షిపర్యాయముగా వాడుచున్నాఁడు †మరదలిపనుచుకా మూ- ‡గదపాదబాష్ప-మూ

సీ. చంచలారోపవైశ్వానరశిఖ లొప్పఁ జిత్రధనుర్లతాస్ఫీతు లెనయ
మేదురగర్జానినాదంబు లెసఁగంగఁ గరకాముపాతపలగతులు మిగుల
నాశుగోద్ధతవ్యాప్తు లవిరళంబులుగాఁగ హరిగోపరుక్ప్రతాపార్చు లడర
వాహిను లెంతేని వడి మించి నిగుడంగ నళసఘోరాస్త్రవిహార మొనయ
నలమయూరాదికవివరు లతిముదమున, ఘనతరస్తుతులొనరింపఁగా ఘనుండు
అఖిలసంతాపకారి గ్రీష్మాపకారి, కడక మాయించె సర్వోపకారియగుచు.

క. *వార్షికమహాభ్రకటలా, కర్షణపటుమంత్రవిద్య ఖరఖరకరతా
ధర్షణకారణ మగులే, ఖర్షభదిగ్వాయు వపువు కడు దీపించెన్. ౫౯

చ. పడమటిగాలి దా జగముప్రాణము నగ్రకరుండు గాంచునే
వెడఁ గగులోకబాంధవత వేదనసేయు నటంచు రోయుచుం
గడు నల(రె)న్ బలారిదెసగాడ్పు వదాన్యఘనుండు దోడుతన్
నడువ జగంబుప్రాణ మనునామము లోకములో విరాజిలెన్. ౬౦

క. జలధిం జుళుకంబునఁ గొను, బలునేర్పరి కుంభయోనిఁ బ్రార్థింపుచుఁ ద
జ్జలముగొను †నేర్పు గన నన, జలదంబులు జనుసతోడు చాయకు నడచెన్

గీ. పగలు రేయి దివాకరుఁ బద్ధవైరిఁ, బొడివి వీక్షింపఁ గను విరహిదళనంబ
నేమమునఁ జేయఁబూనుచు నెగడె మింట, విపులతరమైన(యాకృష్ణ)విషధరంబు

క. ధారాధరగళదురురస, ధారానిర్ఝరమునందుఁ దత్త్వజ్ఞులకున్
దూరించెను సమవిషమా, కారజ్ఞానములు రూపకం బొక్కటిగాన్. ౬౩

క. స్థలజలభేదము మానఁగ, జలదము వర్షం బహర్నిశంబు ఘటించెన్
విలసల్లక్షణవృత్తికి, బలుశాబ్దికు లాత్తవృత్తి ప్రతిసేయంగన్. ౬౪

ఉ. అందము గాంచు నెట్టిజవరాండ్రు నెండిలియాడుచో మదిం
జెందు కలంకతో వడిగఁ జేరు స్రవంతివధూటుల న్నిజా
మందతరంగహస్తముల మంచి నెదుర్కొని కౌఁగిలింపుచున్
డెందములోని యక్కలఁక దీర్చు దక్షిణవార్ధి నిత్యమున్. ౬౫

సీ. ఆహితాగ్నుల కెల్ల నాత్మవైశ్వానరరక్షయే కార్యసర్వస్వ మయ్యె
భోగికైనను రాత్రి భోజనం బెచ్చట నన్నమాత్రముకాని యబ్బదయ్యె
సారమంత్రోపాస్తిచతురుల కెసనంబు వార్తగల్గుట గానివారియయ్యెఁ
బ్రతిగృహంబున కేగి ప్రార్థింప(బ్రార్థింప)శిఖ యొకింతొసఁగినఁ జిత్రమయ్యె

* కర్షక—మూ. †నొప్పుగనళన—మూ.

జంబుగూడలకలుములు డంబుమిగిలెఁ, గలికి సంపాదనంబులు ఘనతగాంచె
నన్నదాతకు నేనియు నతిథికోటి కై, నైన నన్నంబు గలదను టరిది యయ్యె.

మ. చటులోద్యద్ఘనగర్జితధ్వనులు చంచచ్చంచలారోచులు
ద్భటవృత్తిన్ ఘటియిల్ల భీతి మదిఁ దోఁపన్ భీరురంభోరువుల్
పటుమానంబులు మాని తమ్ము బలుకన్ బ్బల్ గాఢసంఘర్షఁ జ
ప్పటలై నట్లుగఁ గౌఁగిలింప రమణుల్ ప్రాపింతు రానందమున్. ౬౮

సీ. భూప్రజానంతాపభూరివైశ్వానరజ్వాలతోఁ దావాగ్నికీల యడఁగె
నూర్జితమేదురగర్జితార్భటులతోఁ గందళీసంపదల్ గ్రమ్ముకొనియె
నవిరళఘనసాంద్రతారాహారములతో గోష్ఠీరవములు పొంగులువహించెఁ
గర్షకపాదజాఖండమోదంబుతోఁ గాసరామోదంబు వాసిగాంచె
జాతికుసుమ(జ)పరిమళభాతి కేకి, జాతికేకారవంబుతోఁ జాలనెగడెఁ
జాతకవ్రాతముదితముద్రములతోడఁ, గలయ దిక్కులఁ గటికిచీఁకటులు బలిసె.

గీ. దినదినంబును శుచికాంత్తతేజ మిచ్చి, వగడఁగైకొన రోఁతనిమానవేమొ
తరణికిరణంబులన్నియుఁ బరఁగెనేమొ, ఘనములగుచును గాకున్న నినునిగనరె

చ. జలధిమథింపఁగాఁ బొడమెఁ జంద్రమయుం బగు నుర్వముద్ద దా
బలుఘనమండలంబు వశిఁ బట్టఁగఁ జేయు మహాంబుధారలోఁ
గలియుచు నీరమయ్యె నని గట్టిగఁ దోఁచెను బుద్ధి కాపిచో
జలరుహవైరి నత్తఱిఁ బ్రజల్ గనరేల మొకప్ప జేసియున్. ౭౦

క. నిర్ఝరులలోన నాదము, నిర్ఝరుఁ డగుసీటిచూలి నిరతస్ఫురితా
త్మార్జితవృష్టి న(ని)ర్ఝర, తార్జితదృష్టి ద్రియయ్యె నని ప్రజ నుడువున్. ౭౧

గీ. ఆటవెలఁది యనఁగ నమరెను దద్వృష్టి, యురుపయోధరత్వమిరవుకొనుచు
శ్యామభావ మొదవ సంతతమ స్థల, వికృతిమహిమ కెల్ల విత్తనంగ. ౭౨

గీ. ఉరుతరంబగువృష్టిసూర్యోదయాస్త
మయము లెంతేని సందిగ్ధమయిన యపుడు
సోమపుం గెన్నఁ బ్రణయించుచోట నదపు
ననము యూయత్తనష్టాత్రియహరహంబు. ౭౩

గీ. అఖిల మమ్మయ మగునట్టు లాచరించి, ముద్వోలుంగు విలాసంబుముంచితాన
యద్వితీయతఁ గైకొని యభ్రపటలి, మాదిమబ్రహ్మ మన నిస్తయంబొసంగె.

క. భూరిప్రసాదమధురిమ, ధారాగుంభ(ము)ల సంతతస్ఫురదోజ
స్సారముల నభ్రమండలి, గారించు నన్నవరసప్రకారపుఁ గవికిన్. ౨౫

ఉ. జీవనమున్ హరించియును, జెల్వునిఁ బాపియు, జన్మకోటికిం
గేవలహానిఁ జేసియును, గేరు నినుం దరుగన్ ఘను [illegible]
జీవనవృద్ధి గైకొనుచుఁ జెల్వునిఁ గూడును జన్యసంతతుల్
[illegible]వి వహించు రాజులు పటిష్ఠతఁ గాంచె నదీవిలాసినుల్. ౨౬

గీ. పటుఘనాఘనమండలి ప్రసరదసను
వర్షధారానిరస్తసంజ్వరత గాంచుఁ
జాతకుఁ(డు)తద్గుణముఁ జెందు జగమునందు
విషమభావంబు గైకొను విస్ఫుటముగ. ౨౭

క. నవరసబంధుర మేనియు, నవిరళకర్ణాతికటురవాన్విత మయ్యెన్
*అవగతరసావకర్షం, బవునే యుత్స్పృష్టరసమహత్త్వంబు మొగుల్. ౨౮

క. ఘనమండలి యత్యున్నతిఁ, గనుఁ†దోల్తం బిదపఁ గరకకలితకుసుమజా
లనవజలసేకములఁ దా, మొనయుం బుడమి నీలకంఠముద మొనరించున్. ౨౯

చ. సరసఘనానుషంగమున సంతతతాపము మాని భూమి దు
ర్భరతరపంకమగ్నతనుఁ బాల్పడి యొంబరికింప నద్ది యే
కరము నిదానమౌ జగదఖండసుఖంబున కాదిమూలమై
పరఁగు నపారసాధుఫలభారసమృద్ధికిఁ జిత్రమెంతయున్. ౩౦

చ. కడమటివెట్టచేఁ గడు భయంకరవేదన గాంచఁ జూచి తాఁ
జిడిముడి(పా)టుమై నిమురఁ జెందక సందకపాణి యప్పు డా
కడుసెకపేరడంగఁ దనకాన్పు సుఖంపఁగ రెండుకన్నులున్
బడలికదీఱ చెల్వుగొన వారిధిఁ గూర్చు ఫణీంద్రశయ్యపై. ౩౧

క. ఉరుగర్జితవాద్యధ్వని, సురుచిరకేకానినాదశుభ(గీ)తంబుం
దరుణమయూరీనృత్యము, పరఁగన్నాట్యంబు మిగుల భాసిలుచుండున్. ౩౨

గీ. ఘనతగల్గె జగద్రక్షకత జనత్వ
మార్గితఘటిల్లెఁ గావున నచట భర్త్వ
ముత్వరరమా‡టుచితమన్న యొఱపుమీఱఁ
బొదలివర్షాభువులు చాల రొదలుసేయు. ౩౩

సీ. నిర్ఘాతగర్జితనిరుపమకోపప్రసాదవిహాన్నికస్తులు చాలఁ దాలుక
విద్యున్నటీలాస్యవిలసనంబులుమీఱ నాసారకారుణ్యమతిశయిల్లఁ

*అవితరసావకర్షం-మూ- †దోల్తటిపిదప-మూ ‡షుభిళకస్నె యొఱపు-మూ.

జాతకబర్హిణచతురార్థు లలరంగ జాతు లామోదవిస్తార మొనయ
ఫలహేతుధర్మసంభరణశక్తి చెలంగ సంతాపవార్తలు శాంతిగొనఁగ
రాజహంసవిలాసంబు రాణదొలఁగ, సముశవర్తిల్లు చున్నతస్థాన మొనసి
ధరణిపాలించె ఘనుఁడుచిత్రంబుగాఁగఁ, బాక మొక్కటి యొక్కు వైపరఁగెఁగని
గీ. మానకృతమైనవిరహంబుఁ బూనన య్యెఁ, దరళనయనల కవ్వేళ ధరణిలోన
ఖనకసంపాదితద్రవ్యగౌరవంబు, సాధికరణంబు కర్ణధారాళి నయ్యె. ౮౫
క. కట్టువడె నటికాల్నడ, బెట్టగువర్షములఁ గొనెను బేరముతోడన్
మిట్టమిఱ్ఱుటుపల్లెలు, గట్టిగ మొనచూపసాగెఁ గఱ్ఱులతోడన్. ౮౬
ఉ. కాలువలెల్ల బల్నదులకైవడిఁ గాంచె నదీలలామముల్
గేలి యొనర్పఁగాఁగడఁగెఁ గేవలమబ్ధి నతండు నీరమా
త్రాలయుఁడైనఁ దావికృతినందక యుండు వికారహేతువుల్
చాలమెలంగినన్ వికృతిసంగతిఁ గాంచునె ధీరచిత్తముల్. ౮౭

—। శరదృతువర్ణనము ।—

క. తరువాత శరత్సమయం, బరుదుగ ఘటియిల్లె నంబుజాక్షుస్వాప
పరనామకబహిరంగము, హరియింపఁగఁ జాలు నంతరంగం బనఁగన్. ౮౮
గీ. వారివాహరసారంగవర్ధమాన, బహునదీపంకబాహుళ్యపాటనక్రి
యాతిదక్షిణరామనామాభిరామ, మై శరత్కాల మామోదములరనమరె. ౮౯
సీ. కాలవశాగతఘననీలతాస్థాయిభావభిరాదేశభద్రమూర్తి
సర్వసరిన్నీరసంపదనచ్ఛతాద్వైకాన్యరవాల్మీకిదీవ్యదుక్తి(?)
రుచిరకేకివచోవిరుద్ధధిక్కృద్ధోమసమునభిన్నైకసంశ్రయంబు(?)
సరసిజాహితబింబసత్త్వావ్యశోభాతిశయహేతుహింసపరిష్కారమహిమ
మూర్జితహరిప్రబోధగురూపదేశ, మఖిలహంసగణాకర్షణాఢ్యమంత్ర
మంబుజాతప్రభావ్యంజితాంజనంబు, దనరె నంతయు శరదభిధానఋతువు.
క. సరసతకల్మిఁ బ్రసాద, స్ఫురణంబున నదులు మెలఁగఁ జోద్యంబగు నే
విరసితభావము నందియు, నరుదారఁ బ్రసన్నభావ మందె నరుదుగన్. ౯౧
క. కలుషతఁ గడపెడుశరదృతు, వొలయఁగ సుఖపారవశ్య మొదువ న్నదికాం
తలపులినకటితటంబుల, నలరారఁగఁ బూని రమలహంసకగణముల్. ౯౨
గీ. అలకశాధరు నలరించి యవనిపంక, పటిమ వారించి యుద్యోగిబంధ మెడపి
శరము విడువక యాశరత్సమయ మొనయ, నేటికోటులకలుషత మీాటెమటియు.

క. ఆతతి నంతయు విమలం, బై తనరెం బ్రోషితాంగనాంబర మొకఁడున్
శ్రీతరుణిశోడుమై వి, ఖ్యాతిన్ వర్తిల్లునోక్షయుంకము గాదగన్. ౯౪

క. జీవన మంతయు లోకో, జ్జీవనమున కిడుచుఁ గార్యసిద్ధి వడసి మై
కేవలఫలితంబుగఁ దాఁ, బోవదె ఘనపాళి యతిపుంగవుదిశకున్. ౯౫

మ. పటుసంరంభవిలాస మొప్పఁగ జగత్ప్రాణుండు ప్రేరేప ను
త్కటగర్జాకృతనోక్తు లప్పటిల లోకత్రాణకై జీవనం
బటు వోవైచి యుపారుఁడై ఘనజనుం డాహా వెలంబోయి దా
నటునిట్టున్ భ్రమియించు లబ్ధులకు సౌఖ్యం బబ్బునే స్వార్యతిన్. ౯౬

క. రాజధనుస్సులు నిర్జర, రాజధనుస్సుల మెలంగు*రాణింభాఁథ
శ్రీజనచంచలహృదయాఁ, భోజంబుల నీటికలఁక పూని వసించెన్. ౯౭

చ. నెలయనుమోము లక్ష్మి నను సిద్ధపుఁగస్తురిబొట్టుఁ జెంద ని
స్తులఘనకేశపాశము ప్రసూనవిభాసిత మై మెలంగఁగా
విలసదనూనతారకలవింతరుచుల్ దిశలం జెలంగఁగా
వెలయుచు నభ్రలక్ష్మి యతివేల మొనర్చు ముదంబు చూడ్కికిన్. ౯౮

గీ. మధురరసము ప్రసన్నత మూన కూని
మధ్యవృత్తులుగొనుచు నిమ్నగలు కృతుల
చెలువు గైకొని మోదబు సేయుఁ బూని
ఘనముగఁ బత్రపక్షంబు గలుగునేని. ౯౯

గీ. నీరసం బౌచు జాడ్యైకదూర మగుచు
సుప్రసన్నత గైకొని దీప్రవిష్ణు
పదమునందు మెలంగునప్పటిజలదము
పుణ్యపురుషునిభావంబు పొందు గొనియె. ౧౦౦

క. నెల ధీరలలితుఁ డయ్యెడు, నలనిర్జరపదవి రంగ మనదగుఁ దచ్ఛ్రీ
వెలుఁగునటియగును దారలు, లలితతదంజలివినిస్సరన్మృదుసుమముల్. ౧౦౧

గీ. లలితమైతోఁచునట్టి కళాపదంబు, వింతయైతోఁచు† నేల యమూంతమైనఁ
దలఁపఁ జిత్రంబుగాదె ద్రుతప్రకృతికి, పమగుమై యుద్ది మిక్కిలి వెలయుచున్న. ౧౦౨

క. మధురరససాధకంబై, యధిరాజమహారణక్రియాబోధక మై
యధిగతరససంకరవా, ర్నిధిసుం గొని యాశరత్తు ప్రౌఢిమ మెఱసెన్. ౧౦౩

క. ప్రకటితకాశాకాశా, వికలసవర్ణత శరత్తు విదితం బయ్యెన్
వికృతికిఁ బ్రకృతిత్వము గొని, ప్రకృతికి వికృతిత్వ మొందు భావన్నగుచున్

* రాణగొనుంబాం । ధారాచంచల - మూ† నె రమూంతమైన-మూ.

## —। హేమంతఋతువర్ణనము ।—

క. సర్వజగద్విజ్ఞానా, ఖర్వనిదానా బ్జమిత్రఘనరుచివిద్యా
సర్వస్వహృత్యవిద్యా, ధూర్వహమై మించుమంచు దూకొనె. బిదరన్. ౧౦౫

ఉ. తమ్ములదాయ మేల్గనఁగఁ దాళక తమ్ములనేఁచ మంచు ది
చ్చ్చ మ్మెఱియూదమీఱ వడిఁజొన్పఁగఁ దమ్ములతోడ నాత్మ స
ఖ్యమ్ముఘరించు కల్వలును గాఱియఁ జెందెను మిత్రవర్గమూ
తమ్ము నెఱుంగఁడయ్యె నుచితస్థితిఁ గాంచ జనుండు నేర్చునే. ౧౦౬

క. అహాతా కారతఁ *గైకొని, మిహికాసమయంబునందు మిగుల నెగడుచున్
మిహికాసముదయ మంతట, రహి†సంసృతియనఁగ‡వింత రాయఁగనగునే.

ఉ. నింగికిముట్టి తోడుతన నీటుతొలంచెడు వింధ్యశైలముం
జెంగఁగఁజేయ మంచుమల చిత్రముగా వడి రోదసుల్ గనుం
బొంగుచుఁ గ్రమ్మెనో యనెడుబుద్ధి జగంబుల కావహిల్లఁగా
భంగము లేక యెల్లెడలఁ బర్వె హిమాని నిరంతరంబుగన్. ౧౦౭

క. మంచు గిరితరుల ముంచఁగ, వంచకభిల్లుండు వెదకు వలిమలతోన్
ఎంచుకొనఁగడఁగి రమరు లు,దంచితనిజనిలయనివసదామరతరులన్. ౧౦౮

క. ఆరూఢహిమ మడంపఁగ, నేరుపు గొనఁడయ్యె నినుఁడు నెఱిఁబగటను నీ
'హారమివభాస్వరణిత', స్ఫారోపమ యొనర మిగల జతనంపడియెన్

క. పదవర్ణస్ఫోటంబులు, గదియింపుచు ముఖపదముల ఘటియించఁ గడుం
బదిలముగ ధ్వనులు శాబ్దిక, భిదురధరస్ఫూర్తి హిమము పెంపుమిగులఁగన్.

గీ. ముఖపదోచ్ఛ్రయమున ధ్వనుల్ మొనయఁజేయఁ
జాల నెనయించు రూపకమీలనముల
హిమకవి యొనర్చుదృష్టాంతకములగరిమ
నమజగత్ప్రతియధరప్రణములుగాని. ౧౧౨

## —♦ శిశిరఋతువర్ణనము. ♦—

గీ. దాసిపిమ్మట మార్తాండభానుచండ, భావసంస్తంభనావధప్రాభవంబు
సంగతవసంతికాదృఢాలింగనైక, ఘటనచేటంబు నగుశీతకాల మొదవె.

చ. చలి యిడువేదనం బడఁగఁజాలక పద్మజశౌరిశంకరుల్
మొలఁతల వానవాబ్జమున మించునురంబున సామిమేనున

*కైకొని- †సంహృతి-‡వింతరాయనదగునే మూ-

న్నిలుపుచు నవ్వేతం గడవ నేటికిఁ బాయరు తత్ప్రదేశముల్
దెలువలు గారవం బరుగఁ జేయఁగ న*ద్దశకోర్వనేర్తురే. ౧౧౪

గీ. అగ్నిదివసాంతసమయవివ్య స్తమిహిర, పటుమహఃపూరసంపూర్ణబలుఁడుగాన
సంతతాత్మీయకేవలసన్నిధాన, కలన శీతంబు వారించుఁగా యొకింత.

ఉ. శీతముచేత బాధపడు చిత్రజగంబు భరింపఁగా జగ
త్ప్రీత దినేశుఁ డీశ్వరతఁ దాల్చుచు నంబరమధ్యసీమఁ దాఁ
జాతురి నేగుచు న్నిటలచంచదచంచలదృష్టి కించిదు
న్మీలితముఁ జేసెఁ గావలయు నెమ్మి ఘటిల్ల హరించుశీతముఁ. ౧౧౫

క. కాంతభృశాలింగితధృఢ, కాంతాకుచకుంభమధ్యగతసూక్ష్మబిలాం
భ్యంతరము గని యనంగత, కెంతయునలరుచును మదనుఁ డెడయుంజలికిన్

చ. అరమెయినుండు నద్రిసుత యందపుఁగౌఁగిలిలేక చిచ్చుక
న్నర కడు శీతలింపఁ జెలి కడ్డము సేసెను గరనాళము
ర్భరగరవహ్ని మంచుమలరాయనియల్లుఁడు దేటచందమా
మరసిగలో విషాశిఖరమా బలుకొంపలి లోఁగఁగట్టుచున్. ౧౧౬

క. †చలికిన్లోఁగకఁ నిలిచిరి, వలివెలుఁగులు వెదలుచల్లువాఁ డొక్కరుఁడుౕ
విలసత్తాలాగరువౌ, వలిఋబ్బల నండగొన్నవాఁ డొక్కరుఁడుౕ. ౧౧౭

క. అప్పప్ప యేరికైనఁ, జెప్పంగా శక్యమా నె శీతముమహిమల్
నిప్పుల కప్పులకుం దాఁ, దప్పక యన్యోన్యసదృశతను ఘటియించుౕ.

గీ. మూర్తికౌటిల్య మెంతేసి మొనయఁ జేయు, నధరశబ్దప్రచారంబుల సరఁ జేయు
శీతలరసాతిదూరతఁ జెందఁ జేయు, శిశిరకాలంబు దలఁప విచిత్ర మయ్యె.

శా. ఈరీతిన్ బుతువుల్ విరాజిలఁగ నయ్యేణాక్షి పద్మేక్షణా
కారధ్యానరసానుభూతి ఘటితాఖండప్రమోదప్రవా
హారజ్యన్నిజవృత్తియామ హృదయం బన్యక్రియాజ్ఞానమా
ధ్యారూఢం బయి యొప్పు నక్కజపునిష్ఠం బూని యుండెంగడున్. ౧౨౨

క. జగదండమండనోజ్జ్వల, భగవత్పదవాచ్యనామ ప్రణమజ్జనతా
సుగమ నిగమాంతమానస, ఖగరాజా రవితనూజకల్పమహీజా. ౧౨౩

గద్య ఇది శ్రీమద్రామచంద్ర చరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ యజ్వసముజ్జ్వలత్కృపోన్మీలిత కలాకలాపసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం శాబ్ధి రాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవనన్నయభట్టా రక అహోబలపత్యాహ్వయకవి మహోపాధ్యాయభట్టారక ప్రణీతంబైన కాళిందీకన్యాపరిణయం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

---

*నద్దస-మూ. †చలికిలోఁబడక నిలిచిరి- మూ.

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## — పంచమాశ్వాసము —

---

క. శ్రీపార్వతీసతీపతి, చాపవిలోపనపటిష్ఠ జలదాభలస
ద్రూపక జగత్ప్రదీపక, భూపకవరసార్వభౌమ పురుషలలామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

—♦ కృష్ణుఁడు ధర్మరాజుం జూడఁబోవుట ♦—

చ. జగములఁ బ్రోవఁగా మనుజజన్మముఁ జెందు పురాణపూరుషుం
డగణితభక్తి సత్యకసుతాదికయాదవు లంటికొల్వఁగాఁ
దగిలినప్రేమచేఁ దరలెఁ దన్నెకపెన్నిధి గాఁగ నెప్పుడున్
మిగిలెడుభక్తిచేఁ దలఁచుమేటి యమాత్మజు సానుజుం గనన్. 3

క. ఇంద్రారివైరి చనుచు మ, హేంద్రప్రస్థంబుచూచె నింద్రమహీభూ
సాంద్రసుమవిసరవిగళద, తంద్రమరందైకపూరితస్ఫుటసరసిన్. ౪

సీ. సర్వభాషావచస్సంపన్నిధానంబు, సాధ్యసిద్ధవచోవిచారితంబు
శూరసేనాధారతారుచిమంతంబు, వ్యత్యయకారోక్తపపత్యనుగత
మనుస్మృతభవిలాపాయోగసిద్ధంబు, రేఫోపహతదృఢోల్లేఖితంబు
అన్యథాభావప్రహాణీరూఢంబు, సప్తాంగరూపప్రశస్తమహిమ
మైవిరాజిల్లు చప్పభాషావిశేష, సముదయస్ఫూర్తి హసియింపఁ జాలునట్టి
పురవరంబు హరిప్రస్థపుణ్యనామ, మచ్యుతానందమునఁగాంచె నచ్యుతుండు.

గీ. అపుడు శ్రుతులకు నెప్పుడు నబ్బఁబోని
యసమబాణమహావీరునబ్బగాని
సవిధసంప్రాప్తి యతిథివైభవము గాంచె
సుభగమహిమంపుసమవర్తిసుతుశ్రుతులకు. ౬

గీ. వెన్నునాగమనంబుఁ దా విన్నయపుడ, ధర్మతనయుఁ డనుర్గొనఁ దరలఁబనిచె
ఘనతరానంద మగుతనమనసుతోడ, వాసవసుతాదిహితుల సేనాసహితుల.

ఉ. కూరిమిమీఱఁ దన్నెదురుకోఁ బవనాత్మజు నాత్మవత్సుమం
జేరిసుఖించు పుణ్యములఁ జేరిచి నమ్రసిజోత్తమాంగుఁడై

ధీకుల నింద్రనందనుని దేవభిషక్తనుజన్ములన్ శుభా
ధారవచస్సుధం జిలికి ధన్యులఁ జేయుచు నేగి యంతటన్. ౮

మ. ఒకచో మాధురిఁ గుల్కు పల్కుఁ గనుఁ గొంపొందంగ వేఱొక్కచోఁ
బ్రకటప్రౌఢవచోవిగుంభనలఁ దీవ్రస్ఫూర్తి వర్తిల్ల నే
కవిదోషంబును లేక కావ్యమణి జోకం గాంచు నాస్థానిలో
వికచన్నాయకరత్నమై యనురుష్మద్దీప్తిఁ గాంతు నీక్షింపుమా. ౯

చ. నతు లొనరించు పుణ్యులకు నారతసౌఖ్యవిధానదక్షమా
గతి ఘటియించు మనప్పరమకారణతత్త్వము ధర్మహూతికి
న్నతి యొనరించెఁ బ్రాక్స్వజననమ్మున సంప్రతి తన్నిరంతరో
న్నతి కగుఁ గారణం బని జనప్రకరంబు నుతుల్ ఘటింపఁగన్. ౧౦

క. చాఁగిలి మ్రొక్కి నయప్పర, యోగీశ్వరు గ్రుచ్చి యెత్తి యోగీశహృదా
భోగసమనిజభుజాంతర, యోగింగా ధర్మతనయుఁ డొనరించెఁ గడున్. ౧౧

మ. అలవేదాంతసరస్వతీసముపగూహం బేర్గైకొని య
బ్బలు తేజంబు తనంతఁ దాన నిజదోర్బంధంబునం జిక్క ను
త్కలితానందపయోధిఁ దేలుచు నజాతద్వేషి నన్యోన్యపు
ణ్యులు లేరంచు మదిన్ గణింపుమ వరేణ్యున్ శౌరిఁ బల్లెం దగన్ ౧౨

గీ. జనజనయన యిహాముత్ర ఫలవితాన, మూలకారణ మని మదిఁ జాల నమ్మి
నీకుఁ బదభక్తి చేకొని పిలిచినాఁడ, పితరము నెఱుఁగఁగద యిట నీవె సాక్షి.

ఉ. అట్టిఁడివాఁడ నే నిటుల నంతటిదాతె కనాపకామునన్
గట్టిగఁ గొన్న నీకు సుధకల్పనసేసెద నారసుండఁగ
గిట్టను గాన నాదికవి(?) గేరెద కృష్ణుఁ ద్రుంచి శిష్టున్
దిట్టముగాఁగఁ బ్రోచికొనుదేవర వై జగ మేలుము చొగన్. ౧౪

ఉ. లెక్కకు మిక్కు జన్మముల లేఁతనఁ దక్కి సభక్తి నే నతుల్
మిక్కిలి నీకొనర్చితి సమిద్ధగుణాకర తత్ఫలంబులై
దక్కెను *నాయనమ్రతయుఁ దావకనమ్రతయున్ సమానులన్
నిక్కము ధిక్కరించితిని నిస్తులపుణ్యయశస్సమృద్ధులన్. ౧౫

గీ. తమము హరియించి వస్తుతత్త్వంబుఁ దెలుపు
నీవు కాకన్య దేవత నేర్పుఁ గనము
దురితసంహార జగతి ఖద్యోతు మహిమ
యొనరు నేరీతిఁ దలఁప ఖద్యోతమునకు. ౧౬

---

* నాదనమ్రత యు-మా.

వ. ఇట్లుచితాశీర్వచనరచనాపురస్సరనిరస్సరద్వీపితసూనృతామృతంబుల శ్రవఃకుహరంబులు పూరించుచు నుదంచితరోమాంచకంచుకితసర్వాంగుండై సర్వమంగళాయుతననిజాంగసంగసంగతాభంగురసుఖం బెట్టకేలకు నడలి యమునతోఁబుట్టువుగా రాటంబట్టి వేల్పువాకట్టు దిట్టఁబుటాసనంబు వెట్టిరావడం దధివసించి బ్రహ్మాండభూగోళజంబూద్వీపభూపాలపురహరిప్రస్థతన్నిలయతత్సభాతత్సింహాసనాశ్రయోత్తరోత్తరోత్కర్షనిష్కర్షతత్పరు లగు తత్రత్యకవులవాక్ప్రసారంబులు ససారంబులై వెలయ నుత్తరోత్తరసూక్తులం దత్కృతప్రశ్నప్రయత్నంబు సఫలంబుగా ననుగ్రహించి సహభోజనసహశయ్యాసహాసనసహసంభాషణాదిక్రియల యమాత్మజు సానుజుం గృతార్థుం గావించె నిట్లు కతిపయదివసంబులు గడువ నంతట నొక్క దివసంబున దివసేశ్వరునిమనుమనియనుమతంబున మృగయావిహారవిలాససమాలింగితాంతఃకరణుండై సత్యభామారమణుండు సత్యకాపత్యప్రముఖయాదవవీరులు చేరికొల్వ బలారినందనుం డనుసరింప గుణవృద్ధిసమాశ్రయత్వంబున నానాదేశవిషయత నిక్షిప్త్యాహారవర్ణసవర్ణత మెఱయు శూరాగ్రసరు లగ్రసరులై ననుదేర సమానశబ్దప్రతిషేధ నిష్ఠాధారత "నిష్ఠాసంజ్ఞాయాం సమానశబ్దప్రతిషేధః" ఇతివార్త్తికోక్తి ననుసరింపుచుఁ దద్గుణవిషయతం గృతసర్వాదినిపాతనతవహించుట సర్వప్రాతిపదికంబు నపహసింపుచు(?) ద్వితీయవక్రతమ ద్వితీయక కవర్గచతుర్థవర్ణప్రతిపాదితనాదమేదురీకృతరోదసీకుహరంబు లగు కౌలేయకతల్లజంబులు మదికి నుల్లాసంబుగా వెన్నాడ వాగురజాలప్రముఖప్రధానసాధనసామగ్రిసముదగ్రు లగు నగణితమృగయాప్రకాండు లండఁ గొన నామలింగానుశాసనంబుకైవడి సింహాదివర్గసంమిళితంబై మహారాజాస్థానపగిది నానావిధకవిప్రౌఢోక్తిసంకులంబై ప్రాకృతంబుకైవడి వల్మీకభవపిదానంబై తర్కంబుచెన్నున నతికగ్రశప్రమేయంబై ఛందంబుభాతి మత్తేభశార్దూలవిక్రీడిత లక్షణలక్షితంబై భరతంబురీతి సింహవిక్రీడితహారిణిప్లుతకరిహస్తప్రసర్పితాకలితంబై యుత్తమకావ్యంబువడువున నవాచ్యమహిమంబై యలంకారంబు తెఱంగున ససమవిషమవిన్యాసంబై మీమాంసక విధంబున నానాగమప్రభూతశాఖావైఖరీప్రకాశంబై పాణినీయంబునువున వృద్ధాంగగోత్రాశ్రితంబై త్రిలింగభాషానుశాసనం

బు చెలువున నున్నిద్రప్రాణికంబై యత్యద్భుతం బగు నొక్క కాళిందీతీరకాంతా
రంబు ప్రవేశించి. ౧౭

—శ్రీకృష్ణుఁడు వేఁట సలుపుట—

క. నలుదెసలఁ గాపు లునిచెన్, బలియుల మృగయులను వీరబలశాసనుఁ డా
జలజాతపత్త్రనయనుఁడు, బలశాసనతనయుఁ బిలిచి పటువేగమునన్. ౧౮

గీ. అతులచాతుర్య మొదవంగ నమ్మహాత్ముఁ
డమర ఘటియించె నపుడు పూర్వాదులందు
సంభవత్తత్త్వమాయసంజ్ఞ* నరగఁ జేసి
సకలవిబుధులు వినుతింప సద్వ్య(వ)స్థ. ౧౯

క. దిక్కులఁ గ్రమ్మి భటుల్ రొద, లొక్కుమ్మడిఁ జేయ మృగము లురవడి బెగడన్
మిక్కుటపుసువివాక్షులఁ, బెక్కండ్రనిసీతకవులు బెదరెనుమాడ్కిన్. ౨౦

క. జలజాక్షుమఱఁది తమ్ములు, బలుమృగముల వెదకి వెదకి పడఁజేసిరి దో
ర్బల మలర శాబ్దికోత్తము, లలయపశబ్దముల నెమకి హరియించుక్రియన్.

గీ. అలసనత్త్వంబుల నసత్త్వములఁ గ్రియా †ప
రాశయముల స్వరాదుల నవ్యయములఁ
దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంత
సంగ్రహాయత్తమతి యైనసాధుమౌళి. ౨౨

గీ మాన్యుఁ డైనట్టి యాధ్వనిమార్గవేది, లక్ష్యమూలంపుధ్వని నవలంబనంబు
చేసి హరియించె మిక్కిలి వాసిగాంచు, తనకృతిత్వము మర్మవేత్తలునుతింప.

క. కరమరుదు కృష్ణమేఘం, బురుతరశరవర్షవైభవోదగ్రముగా
ఖరవైశ్వానరకీలలు, విరళితలై కన్నియెడల వే కననయ్యెన్. ౨౪

గీ. అవ్యయప్రకాశ మ‡విభక్తికోజ్జ్వలం, బగళితోరుసత్త్వ మంతకార్య
కరము నాచు మెలఁగె సురుచిరతద్ధిత, కృద్గణంబు దహనకీలితంబు. ౨౫

వ. ఇటు మృగయావిహారంబు కొంతప్రొద్దు గడపి చాలించి యమ్మహామాయ
లాఁడు రాజార్హంబు లగు నామిషంబులతోఁ బరివారంబు హరిప్రస్థంబున
కుఁ బోవఁ బంచి విశ్రాంతివ్యాజంబున నర్జునానుచరుం డై కమలాసనవర
మహంసనీలకంఠసంసేవితం బై శుకముఖసుకవికరసముపభోగయోగ్యం బై
తనుభవశ్రాంతిసర్వస్వాపహరణప్రవణం బై శరద్రాకాశశాంకాకలంకచ్ఛా

*లలరఁజేసి-మూ. †పరాశ్రయములు-మూ. ‡విభక్తిమోజ్జ్వలం-మూ.

యాచోరప్రభాభరంబై తెలిదీవివైఖరిం బరిహసించు నొక్క కాళిందీనది
సుందరపులినతలంబున విశ్రమించి. ౨౮

కం. కనియెం బద్మదళాక్షుఁడు, కననివినని మేలుసుషమఁగల ప్రియురాలిం
గనికనఁగరాని చంచలఁ, దనులత యచలంపుఁ గోఁచిఁ దల మనుదానిన్. ౨౯

— శ్రీకృష్ణుండు కాళిందిని జూచుట —

కం. ఉపమానభావమును దన, కుపకారముగాఁగఁ దలఁచు నఘన మగుచుం
దపముఁ బలు *కాఁకఁ దనకై, తపియింపుచునుండునట్టి తపనతనూజన్.

కం. కనికని నిరతిశయానం, దనిధిత్వ(ము) గాంచియేని కమలదళాక్షుం
డనలేనిముదముఁ గొనుచున్, మనమునఁ గాళిందిరూపమహిమను పొగడున్.

గీ. ఏతదఘనసంగతి నెట్టిముదము, †విమయివర్గంబుఁ గైకొని వెలసె దానిఁ
గాంచుఁబున రేతదంగసంఘటనగలుగ, భాగ్యమెన్నఁటికబ్బునప్పటికిమగుడ.

చ. సరసిరుహాననంబుఁ గొని సన్ముఖసీమ గృహీతవాచమైఁ
బరఁగఁగ శ్రోత్రియత్వమునఁ బాటిలి పూర్ణతపంబుసేయఁగా
సరసిజగర్భ! యీయువిదచక్కఁదనం బొనగూర్చు నేర్పు నీ
కరుదు ఘటిల్లెఁ గా కరయ నల్పతపంబున నిట్టి దబ్బునే. 3౧

ఉ. సారసగంధిమధ్యమము సంఘటియింపఁగ యోగ్యవస్తునం
భారము లేమినో యిది యభావముచేసితె పద్మజాత నీ
నేరుపు నెట్టు లెన్నకొన నేరఁగనయ్యెద దానిమీఁదటం
జేరి వసింపఁజేసితివి సిబ్బెపుఁగుబ్బలు గొప్ప‡క్రమ్ముడిన్. 3౨

గీ. ప్రస్ఫురద్వ్యక్తిసంబంధబలముకలిమి, నుల్లసించె నలంకృతు లెల్లఁ గాన
లలనయుత్తమకావ్యంపులక్ష్మి యనుచు, నవనిరసికులుగొనియాడుటరుదుగాదు.

గీ. అమథనావిలసింధుమధ్యప్రభూత, పద్మవాసిని యాశరత్పద్మనయన
వ్యక్తిసుందర§తాన్యకృతాఖిలోరు, భూషణత ముఖ్యకృతిలక్ష్మిఁ బోలునింతి.

సీ. ఇది మన్మథోన్నత్యహేతు వౌటఁ దలంప మదికిఁ పులొనరించుమరుసిదంతి
దంతిగా దిది మృదుత్వంబు చాలఁ జెలంగ మరునిచేతమెలంగు విరులబంతి
బంతిగా దిది కంబుపట్టుగామి మెఱుంగ సోఁకలీనెడు మేలుసోగమెఱుపు
మెఱుపుగా దిది నిల్కడఁ గొఱపుమైఁ దనరారమానసప్రియభావ మూనునంచ

*కాఁచి-మూ. †విషయ-మూ. ‡కొమ్ముడిన్-మూ. §తాన్యకృతా-

యుంచగా దిది ఘనరుచినందికొనఁగ, మధురనాదానువృత్తిచే మాన్యపికము
పికముగా దిది తెలికంటిబెళుకు లెనయు, నతులసౌందర్యదివ్యరత్నాకరంబు.

వ. మఱియుఁ గబరీజలధరమాలికయు నలికచంద్రరేఖయు నిరీక్షణచంచరీకావళియు భ్రూమనోరమయుఁ గపోలశోభావతియు నాసికాకనకమాలయుఁ గర్ణశ్రీకలితయు నధరమధుసతియు హాసకౌముదియు సుముఖశాలినియుఁ గంధరామత్తకోకిలయు వాగమృతధారయు దంతమౌక్తికమాలయు బాహాకుసుమితలతయు హస్తాంబురుహయుఁ గుచబంధురయుఁ దనుమధ్యాంచితయు రోమాళిభుజంగవిజృంభితయు నాభీవిపులయు జఘనక్షమాభిరామయు నూరుదండకమండితయు జంఘాప్రభోపరంజితయుఁ బాదలలితయు నంగలతాచపలయు గుణమణినికరయు నగుచు వృత్తరత్నాకరకృతి నగుచున్న దిక్కొమ్మమొమ్మొ, యేముద్దుగుమ్మకైన వసమ్ముగా *నమ్మమ్మ యని మనమ్మున ఘనంబుగాఁ గొనియాడుచు నక్కితవయాదవుండు దొడనుండు నాఖండలనందను వీక్షించి యిచ్చంచలాక్షీయుదంతం బాద్యంతమ్ముఁ దెలిసి రమ్మా పొమ్మా యని వినోదంబున ముదంబుగాఁ బనిచిన. ౩౬

—శ్రీకృష్ణుండు కాళిందికడ కర్జునుని బంపుట—

క. సిరికి నలవడనిశోభా, భర మీయింతికి నెసంగుఁ బద్మాక్షునకే
తరుణి యిది గృహిణి గాఁ దగు, నరునా శిరమెక్కి యుండు టట్లు ఘటిల్లన్.

గీ ఇట్టిసౌందర్య మొనరించునట్టిధాత
కమరు నస్త్రీత్రియీయింతి హరికిఁ గూర్ప
మిక్కుటంబుగ జగములో మెఱయుఁ గాని
యన్యునకుఁ గూర్ప నయశోబ్ధి నది యడంగు. ౩౭

క. ఈగతి నద్భుతరసనం, యోగిహృదంతరములోన నువిదఁ బొగడుచున్
†భోగిశతల్పుననుపున, నాగుణధుర్యుండు వేగ నరుగుచు నచటన్. ౩౮

సీ నభయందుఁ బాడితనస్మృతవాణికైవడి మహాసరసిరోఘలను హంసి
వలె నభఃస్థలమున జిలుగుఁజందురుసోగవదువున నవమేఘపటలి మెఱపు
చెన్నున నాలయసీమఁ బ్రదీపంపుఁ గళికవైఖరి బోదె నలరుతీవ
చెలువునఁ దనువున ఫలశాఖపోలికఁ, ‡బరమశాన్యంబున వ్యక్తిమూర్తిఁ

* దమ్ముడు-మూ. † భోగిపర్యంకుపనుపున-మూ. భోగిశరియుంకు అని కవిభావమేమో. అది యసాధువు. ‡ బరమా-మూ.

బులినతలమున మెలఁగెడుపొలఁతిఁ జేరి, తరళలోచనవలనిసత్కార మంది
తుందిలానందమునఁబొందికుందరదన, వదనమీక్షించి మాధుర్య మొదవఁబలికె.

క. కలికి నీనామ మెయ్యది, జలజానన కన్నవారిసంజ్ఞలు కీదృ
క్షులు హేతు వేమి నీ వీ, పులినంబునఁ దపము సేయఁబూనె సుమతికిన్. ౪౧

గీ. తేఁటియుంటనికుసుమంబు తేట దోఁచు
నీదురూపంబు గనుఁగొన్న నిర్మలాంగి
యర్హ్యవరకాంక్ష దేవతాప్రార్థనంబు
సేయుచుండెద వని నాదుచిత్త మొదవె. ౪౨

గీ. తన్వి యిచ్చటఁ బరమసాధనతఁ గాంచఁ
దనువిలాసంబె యితరసాధనము లేల
యరసి చూడుము పండితురాలవైన
ఘనఫలావాప్తి *బోధనకన్నఁ గలదె. ౪౩

క. నా విని తమ్ములనేలెడు, దేవుని గాతాపుఁబట్టి తేటమొగమునన్
శ్రీవి నుసునగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్. ౪౪

గీ. †జ్ఞాతృతాధర్మమున కధిష్ఠాన మరయ
నీదురూపంబు ‡గాకున్న మేదినీశ
యాభిరూప్యప్రసిద్ధమాహాత్మ్యమునకు
నధికరణ మాట మానసీయుత వహించు. ౪౫

ఉ. కావున నాయుదంత మవికారగుణాకర చిత్తగింపు మే
దేవుఁడు సాయగేస్తుఁడయి తెల్విఁ జగంబుం గొల్ల §నీను న
ద్దేవుఁడు నన్నుఁ గన్నతఁడు దీనునిపాలిరమాధినాథునిన్
దేవునిఁగా వరించుకొను ధీ కొని యిట్టి వ్రతంబు నల్పెదన్. ౪౬

గీ. అసితరుచి యగునీనది కధిప నేను, జన్మదేశైకతన సహజన్మఁగాను
నామధేయంబుచే నేని వరవరేణ్య, తత్సహోదరిఁగా నన్నుఁ దలఁపవయ్య.

గీ. కర్ణిమిత్తదయాంభోధి నీరజాక్షుఁ, డనఁగ నెఱనమ్మి మదిలోన నతని నునిచి
నాయథాశక్తిఁ గొల్చుచున్నాను నేను, భాగ్యమెట్లున్నదో కానిపార్థివేంద్ర.

క. ఎన్నఁడు పద్మాక్షుండు ప్రసన్నుండయ్యెడునో కోర్కె సఫలతఁగొను టెం
కెన్నఁటికో తెలియదు నిన్, గన్నారం గంటిఁ గంటిఁ గన్నా సుఖమున్.

* బోధన-మూ. † జ్ఞాతతా-మూ. ‡ గాకున్న-మూ. § నీను.

గీ. అనుచుఁ గన్నీరునించుచు నాననంబు, మిగుల వాంఛించి యాతీవ మెఱపుఁబోఁడిఁ
జూచి తలయూఁచి యానందవీచిఁ దేలి, ప్రాఁదిదొరబిడ్డ యా*చైత్రగోచి కనియె.

గీ. నిరతిశయ మైనసీమేని నెఱిమెఱుంగు, నిర్మలం బైన నీభక్తినిష్ఠఁ గూడి
రయము నిరాఱుఁగఁ దప్తరగ్రహముఁ గూర్పఁ, దప్తరగ్రహములవసునత్త్వపులకు.

క. అని పల్కి కలికి యనుమతి, గని తూరుపు వాఁటి వేల్పు గనినయుదారుం
డనితరలబ్ధామోదం, బని తలయూఁచుచును వేగ హరిఁ గనవచ్చెన్. ౫౨

క. † వచ్చిన నచ్చెలు వచటికి, వచ్చి(న) కార్యంబు రూపనైఖరి మదిలోఁ
బొద్చెంబు లేనిభక్తియు, ముచ్చటకడి యనుగ సకలమును వినుపించెన్.

చ. చెలికలవార్త యిట్లతఁడు చెప్పినఁ దప్పక యాలకించి యా
జలరుహపత్రలోచనుఁడు చక్కఁగ లేనగుఁబువ్వు నీటిచే
నలఁతిఁ దొలంగుప్రేమమున నాననపద్మము కన్నుదోయి మే
లొలయఁగ నింతిఁ జూడ మది కొప్పునం దొగి నేగి యచ్చటన్. ౫౪

—శ్రీకృష్ణుడు కాళిందిం గొనిపోవుట—

క. శృంగారైకాశ్రయమగు, నంగనసెమ్మెయి చూచి హరి నవరసపా
రంగత ‡మగుననుభూతిచె, లంగఁగ దామెలఁగె నబ్బురంబు దలంపన్.

సీ. నీలాభ్రమునఁ జాలు నెఱికప్పుజిగిజాలు మేలు నవ్వఁగఁ జాలు మేనివానిఁ
జలతలేక లసించుతొలి వాఁటిబయలుమించు నొప్పు నేరము లెంచు నొల్లెవానిఁ
దొలుతవేళ నెసంగు జలజాతములఁ గ్రంగు గలకన్నులబెడంగు గనెడువాని
నమృతధారలుచిల్కు నట్టిచందురుకుల్కు, నగవు నప్పులతళ్కు మొగమువాని
లచ్చిపేరాదికలపేరుమచ్చవానిఁ, గౌస్తుభకిరీటముఖవరిష్కరణవాని
సుడికి నీడగు నొకవాలు వడయువాని, వింతుకన్నానఁ గన్నగోవిందుఁ గనియె.

గీ. కనియు శ్రీవనితరహృద్ధ్వానఘటితసర్వ, దేశనంతతదివ్యత్త్వదీయదివ్య
రూపజాలంబులోనఁ దద్రూపమపుడు, మిళితముగఁ గొంతసేపింతిమిన్నకుండె.

క. అంతటఁ గాంతకు లక్ష్మీ, కాంతుసినిజరూపగరిమ గననయ్యెఁ దదే
కాంతి(క)దృష్టిప్రభావత, పొంతఁ బురందరునికట్టి పొసఁగుటచేతన్. ౫౭

చ. హరినిజరూపమాత్మ ముద మారఁగఁ గాంచినకాంచనాంగికిం
బరిచితిఁ జెందవయ్యె నభివాదనవార్తలు సంస్తవక్రియల్

---

*చిత్రిరోచి. †వచ్చి యచ్చెలువ యచటికి ‡ మగుననుభూతి శ్రీవనితరహృ-మూ.

కరము మనంబులోపల నఖండితభక్తి కుదిర్ప యజ్ఞునిన్
హరిహరి యూటుఁ గనిపట్టికచాకచి సంఘటిల్లఁగన్. ౫౯

గీ. వెలఁది "యభ్యాగతః స్వయం విష్ణు"రితి వి
చారసాంగత్య మొనరఁగఁ జలదసాంగ
వీక్షణాంభోజమాలి కావిసరములను
బూజ యొనరించె నాజగత్పూజితునకు. ౬౦

గీ. కృష్ణఘనరుచి దనచెంతఁ గీలుకొనఁగఁ
జాముముఖచంద్రుఁ డప్రకాశత వహించె
నినుదక్రేఁగంటిచూపులు నీలవేణి
రుచివిలాసంబు దన్మైత్రిరుచి గొనంగ. ౬౧

గీ. అంబుజాననదనుఁజకోరాక్షి యనుట, నిజముగాఁ జేయఁదలఁచి యోనీరజాక్షు
వదనచంద్రుని బాయ కవ్వారిగాఁగ, బారుకొనఁజేసెఁ దనదృక్చకోరకములఁ.

చ. అపుడు ముకుందుఁడింతిఁ గని యంబుజమిత్రతనూజ నీదు ని
త్తపము ఫలించె రమ్మనుచుఁ దల్పుల లేనగుమోము గ్రమ్మఁగాఁ
* దపనతనూభవం జెనుట తద్దయుఁ గ్రమ్మ రథంబుమీఁదఁ దాఁ
గృపనిడుకొంచు ధర్మజుని కేళిపురంబున కేఁగె నెమ్మిగన్. ౬౩

క. అచ్చట నారాజున కమ్ముచ్చట దెలియంగఁజేసి భూపతిమదిలో
ముచ్చట దీరఁగఁ గొన్నాళ్ళచ్చపుఁ బ్రేమమున నిలిచి యదుపతియంతన్.

క. పురమున కేగుతలంపున,నరవరునానతి గ్రహించి నలువారఁగ న
న్నరుఁ దోడ్కొని చనువేడ్కల్, పురణింపఁగ డాయఁజేరి భూపతిఁ బలికెన్

గీ. అనఘకృతి యపార్థ మగునేని పండిత
హృదయమునకుఁ బోలె హితము గాదు
నామదికి నెపుడు నయఁ బాపు మటుగాన
నన్నుఁ బంపి రాఁగ నరవరేణ్య. ౬౬

వ. ఇట్లు బావయగు తోవకొమ్మతోలంగుడు బావబిడ్డబిడ్డని చే †సోమానుల పెట్టుంజెట్టుపట్టి తనవెనుకటిరాకకు నానతివడసి యతండు రా ‡వయ్యోడ్డ కేడ్డొరబిడ్డ ప్రామిన్ను సొమ్ముబరణి గన్నకన్నెఁ గొని నిజపరివారపరివృతుండై కదలి సంద్రంపుటగడిత పడయు బెడంగుప్రోలు మేలుబాతికిం జని

---

* తపనతనూజభవన్ జ౨౨-మూ. † సోమానుల ‡ వయ్యోడకేడ్డొబిడ్డ

యెంతయు సంతోషంబార నయ్యుదంతంబు నిజాంతరంగములకు నెక్కించి తదనుమతి రిక్షనుడువులఁ దెలియం బ్రోడతోలిపుట్టువుజన్నిదంపు వారులఁ బౌరుల రావించి నిరస్తదోషతిమిరంబును సుగుణవర్తియు సుగ్రహాస్నేహంబు నగు నొక్కసుప్రకాశ వివాహముహూర్తం బేశ *వ్యాసరభాసురం బని నిశ్చయింపించి సర్వజనులం దగుత్సవంబునకు రా నియమించి మీఁదటి †శక్ర చక్రవర్తిం బిలిపించి తత్పురాలంకారంబునకు నియోగించిన. ౬౭

గీ. అన్నివింతల కాస్పదం బగుపురంబు, నందు నేవింత ఘటియింప నతఁడు నేర్చు
నయిన నత్తఱిఁ బౌరుకృత్యం బొనర్చె, నతులచాతురిఁ గొన్నిరుదార్థములకు.

వ. అంత. ౬౮

సీ. వేవెలుంగులు గల్గు విన్నాణి వేలుపు ముపొఁడుములు నిల్చ గొప్పగద్దె
ముత్తోంటిపలుకులు మొనయు వేసము వాఁడు తమ్ములనగియించు తళ్కుతేఁడు
సుడివాలు పేరింటిపులుఁగు నేదునొయూరి పండ్రెండురూపులబలిమికాఁడు
కడలియిల్లటపల్లు బెడఁగుబల్లుడికన్ను పగలుగావించు నేర్పరుల మేటి
లెక్కపేరింటిగుఱ్ఱంబు దక్కుజోదు, చుట్ట మంతటి కనఁ దగు దిట్టసామి
చాయకైవడి వెన్వెంటఁ జాయరాఁగఁ, గూఁతు పెండ్లికిఁ జనుదెంచెఁ గూర్మి మిగులఁ

గీ. పెండ్లి యఖిల ప్రమోదంబుఁ బెనుచు జగతి, నఖిల జగములతండ్రి పెండ్లియనఁగఁ
బిలువకున్నను బిలిచిన నెలమి రాక, యుండువారు జగంబుల నుండు టరిది.

క. పంకజలోచనునప్పురి, సంకోచాభావ మొనర సర్వజనంబుల్
పొంకము మీఱి మెలంగఁగఁ, బంకజనాభోదరంబుభాతిం గనియెన్. ౭౦

సీ. చతురాగమానూనసారస్వతస్ఫూర్తు లొకచోట నానంద మొదవఁ జేయఁ
‡జతురాతికఠినదర్శనఘోషవైఖరు లొక్కచో మోదంబు నిక్కఁ జేయఁ
జతురుదాత్తకవిత్వసాధుసిస్వానంబు వీనుల కొక్కెడ వింత యొసఁగఁ
జతురభినయసమంచన్నేదురధ్వను లొకపంక్తి సంతసం బొప్పఁ జేయఁ
జతురనల్పమహావాద్యవితతినాద, మంజిమం బొక్కదిక్కున ముదికుమర్ప
నద్దిరద్దిర యోహహో హోయరారభళిర, యపుడు నాదాత్మ బ్రహ్మమయ్యె బురము.

క. అతుకవ్యక్తులకైవడి, నకృతాఖిలదోషయోగ మయి సుగుణంబై
తుకవుల వాక్కులు ముదమిడె, సకలజనుల కచట బ్రహ్మసదనత నేమో. ౭౨

---

*ద్వ్యసుర. †శక్ర చక్రగరతం. ‡జతురతికఠినదర్శఘోష—మూ.

ఉ. నందడి జాతి భూ(వ)వరనంతతభూషణపద్మరాగముల్
పొం దగునందుఁ గుఁ జివురుబోఁ దె లటంచు గజంబు లూని యీ
సొం దుచు మీఁదికింబఱుప నూర్ధ్వతలంబున నిల్చె నవ్విరా
నందములు లేక తన్రుచులు సాఁకును రక్తవితానరోచులన్. ౭౬
సీ. వితతవజ్రోపలావిరళకీలితములు మున్ను వీథులు పంకమునకుఁ జొరవు
బహుళమహాదారభద్రభదానవారాపగాపూర్ణంబు లయ్యె నిపుడు
బహుళమహోదారభద్రభదానవారాపగల్ పయ్యగమ్మ సమితనృపతి
సంబాధహేతుకసంఘర్షణచ్యుతచారుసౌవర్ణభూషణరజంబు
లెనయ నవి పంకమై *నెరెవెర్గఁబోలఁ, దత్క్షణంబునఁ దద్వృత్తిఁ దాల్చెవీథు
లంతటనపంకతవహించె సమిత †జన్మి, బహుళసమ్మర్దజనితోష్మబలముకతన.
గీ. లక్షణాఢ్యగుణస్థూలలక్షులందుఁ, దనరె స్వనసమర్పణము పరార్థముగాఁగ
నఖిలకృతలక్షణులయందు నధివసించెఁ, జెన్నుగ స్వసిద్ధికై పరాపేక్ష మచట.
క. చిత్రవ్యక్తుల నట వా, క్చిత్రాభి‡వ్యక్తు లేమి చిత్రం బగు నే
చిత్రవ్యక్తులఁ జిత్రము, చిత్రధ్వనియుత నర్థచిత్రత మెఱయన్. ౭౮

## — శ్రీకృష్ణుని మంగళస్నానము. —

ఉ. అంతట గర్గముఖ్యు లగునట్టి మహీసురు లెల్ల వచ్చి శ్రీ
కాంత సమీపవర్తి యయి కానఁగనయ్యె ముహూర్తవేళ మీ
రింతట జాగు మానఁ దగు నిచ్చ శుభార్థము మజ్జనంబుపై
నింత వసింపఁ జేయు మన నీహితి మెప్పుఁగ మాధవుం డొగిన్. ౭౯
క. అంజనగిరితుల్యుం డని, రంజనుఁడు జగంబు లెల్ల నంజలు లిడఁగాఁ
గుంజరగతి వచ్చుచు న, భ్యంజనమున కతులపీఠి నాసీనుఁడు గాన్. ౮౦
ఉ. వన్నెలు మీఱు గొన్న చెలువం గొని పొంగుచు నస్మదాదులం
గన్న యనాదిపూరుష యఖండమహోదయ యిట్టిపెండ్లి నీ
కెన్నఁగఁ దన్మహామహిమ నే కద గాన భరింపు మా మె నం
చన్నలినోద్భవాదిసుర లచ్యుతు నౌఁదలఁ బెట్టి రక్షతల్. ౮౧
చ. దరము దరంబు నిచ్చు రొదఁ దాల్చును దా నరిగాదు వీణ వ
ల్లరయఁగ మేళవింప నగు నస్ఫురితాక్షర మద్ది సాటియే
సురుచిరవర్ణసన్మధురసూక్తిగళంబుల కంచు నెంచ న
ప్పురమునిచెంత నంగనలు పాటలు వాడిరి నెర్పు మీఱఁగన్. ౮౨

* నెరెటిగ్రమో. † జన్మ. ‡ వ్యక్తిలేమి.

సీ. రమణీయనాయకరత్నంబు నంటంగ హేమవల్లికి వేళ యిదె యటంచుఁ
జంద్రరేఖకు నబ్దసాంద్రాంధకారాభ చికురముల్ దెరలించు చేగయంచుఁ
గృష్ణమేఘము చెంతఁ గీల్గొని మెలఁగంగ విద్యుల్లతకుఁ జాలు వేర వటంచు
సిదె సర్వమంగళాస్పదునొందలంటంగ మందాకినియె నేర్పుఁ జెందు నంచు
విధుని సేవింపఁగను దార విత్తె యనుచు, నీలవేణియె గోవిందు నెలవటంచు
నంబుజాక్షులు సర్గోక్తులాడుకొనుచుఁ, గడు ముదం బొప్ప మధువైరిఁ గ్రమ్ముకొనఁగ

సీ. స్నిగ్ధంబులై మించి చెంతలచూపులు రమణ నీలాబ్జతోరణము లనుప
*సేదనీరొగిఁ గ్రమ్మి చెన్నారు నెమ్మోము సమరందకంజచ్ఛాయఁ బూన
ననవిల్తువల్లిఁ బోలి నవీఁపుపై వాలు చందమొందుచుఁ గీలుజడ చెలంగ
బిగువుకంచుక(ము)లో బెడఁగుదిట్టమెఱుంగు చన్నుమిట్టలోకింత చలనమొంద
హారములు దూఁగఁ గా నసియాడఁ దొడఁగ
వలచు నూర్పులు పెంపెక్క వళులు నిక్కఁ
గంకణధ్వను లలతాళగతుల నెనయ
శౌరితల యంటె నొక †మహోదారజఘన. ౮౪

వ. ఇట్లు యదుకుంజరుండు సాభ్యంజనుండై యొక్క కుంజరయాన కైదండ యొసంగఁ గ్రొమ్మెఱుంగు నండగొను ఘనాఘనంబునను వున ధరాధరశృంగోన్నతం బగు నవగాహనగేహంబుఁ బ్రవేశించి యొక్క మించుఁబోఁడి వలపులు నించు మంచిగంధంబు‡టటకలిం బెన్నరుల నూనియ నిగ్గుఁ§దగ్గఁ జేయ మఱియొక్క కొమ్మ కమ్మతావులూరు జలంబుల జలకం బార్చ నొక్కరంగులాఁడి బంగరురంగుల తెఱంగుల మరుంగువడఁ జేయు దువ్వలువ కవ యొసంగ నుత్తరాధరాంగంబుల ధరియించి కొందఱు మందయాన లమందానందంబున నెడనెడ మంగళారాత్రికంబు లొసంగ వాసంతికకుసుమ విచిత్రాస్పదంబును జంపకమాలోత్పలమాలికాభ్రమరవిలసితలసితంబును మంజుభాషోర్వశీసుముఖీమనోహరంబును నానావదార్థసమృద్ధంబును బ్రసన్నంబు నతిమధురధ్వనిసమాలింగితంబు నస్పృష్టదోషలేశంబు ననుగతాఖిలాలంకారంబు నగుచు మహాకావ్యంబుతో నెక్క నెక్కెంబు లాడు వివాహవేదిం దా నాయకరత్నం బగుట నధివసించి కొంద ఱిందువదనలు కురుల తడియార్చి సంస్కారధూపంబు దీర్చి జలార్ద్రానిలంబులం దేర్చి సురభిళకు

---

*సేదనిరోని-మూ. † మోహదార-మూ. ‡ టలకంబున- § దంగంజేయు-మూ,

సుమమాల్యంబులం జేర్చి యంతరేకాంతపరిపూర్ణతా బహిరుదీర్ణసత్త్వ
గుణవైభవభ్రమంబు నవగమించు దివ్యచందనలేపనం బమర్చి యమూల్య
రత్నకలాపంబులు తత్తదుచితస్థానంబులం గుదిర్చి యా కాళిందీముఖారవింద
* దర్శనాదర్శనం బీయాదర్శనంబు దర్శింపు మనుచు మనోభవప్రతీకదర్శన
ప్రదర్శితబింబప్రతిబింబైక్యంబై తద్దర్శననిశ్చితంబుసేయం దగు ననుచు నో
రొక ముకురకపోల యొకనిద్దంపు నిలువుటద్దంబుం దెచ్చి ముందట నిడ
నయ్యవసరంబున నచ్చంపు నెలదాల్పు నబ్బాచులయెకిమీనికిం ప్రాతిభ
ట్యంబు వాటించి యఖండచండకిరణమండలంబు దాల్చెనో యన నలరారు
మణికిరీటంబుగల శిరంబును గచప్రచయసజలజలదకరిగళన్ముక్తాఫలజాలం
బుపోలిక వెలుంగు తెలిమ్రానిపువ్వులబాసికంబును దద్గంధాస్వాదనలోలు
కబంభరడింభంబులవిడంబించు నలకంబులు గలయలికంబును దావితామర
పువ్వుల మదిఁగదురం బఱతెంచి కదలకనిల్చు తేఁటికూన లేమనం బొలుచు
కమ్మకస్తురిచుక్కబొట్టుగల నెమ్మొగంబును నిజాంతేవాసులం బ్రోవ మనవి
కేతెంచి కర్ణాంతికంబుల నిలుచు వేలుపుతొలువేలుపొజ్జల నుజ్జగించు నాణి
సుపాణిముత్తియంబుఁ గొంటులు గలకర్ణద్వయంబును సకలంకాపూర్వశశాం
కశకలశంక నంకురింపం జేయు వివాహనేపథ్యోచితకజ్జలబిందువు పొందుఁ
గొను కపోలతలంబును గంధరాభిధానబంధురకంబునిరర్గళనిర్గతమౌక్తికమణి
రాజరాజులో యనం బరణించు మనుదంచన్ముక్తాహారభేదంబులు సంతరసవకాశ
బహిఃప్రకాశద్ర(వ్య)విమయ కానురాగంబు పెంపుదలపించు కౌస్తుభనామ
మణిసార్వభౌమంబును గల శ్రీవత్సవనమాలికామనోహరవిశాలదోరంత
రంబును నవికలమణికీలితబలభిదుపలస్తంభజృంభణసంభావితంబులగు చిరత్న
రత్నకీలితకేయూరాంగదవిలసితభుజాద్వయంబును మణిబంధప్రభావలయం
బన నలరారు మణివలయంబుల నలరుకరంబులును నిజోదరాంతరావసదనం
తవనజాండభాండస్థైర్యకార్యార్థంబనా నిబద్ధమణిమేఖలం బగు కటిప్రదే
శంబులును దెలినీటియేటి † కమ్మియెమ్మి నా మగరాల తేటనీటు లుద్ఘా
టించు కటకంబులు గలపదద్వయంబును గలిగి లక్ష్యాలక్ష్యపదార్థజీవితం
బగునమ్మహాపురుషునకు నిట్టియలంకారవ్యత యబ్రమే యనుచు నార్యులెన్న
వెలుంగుచుండె నవ్వాఁడు. రగి

* దర్పణంబియాదర్శనంబు. † కెమ్మి-

గీ. కంజనేత్రుండు బహుపరిష్కారయుక్తిఁ, ద్రిగుణసంబాధభవ్యశఁ దేజరిల్లు
నప్పుడు నస్మృతితో మైత్రి నందికొనియె, నొకయదో మతకత్సున్నై యుండఁగాని.
క. మును హారునికంటిసెకలం, జెనసిన యొకమదనుఁ గనియె శ్రీకాంతుఁడు దాఁ
గన వింతపెండ్లికొడుకై, మరుచు ననంఖ్యాకసుకరుమదనులఁ గనియెఁగా.
వ. అంత. ౮౮
ఉ. ఐకువరాంగ్రు హంసతనయామణి క్షీరపయోధివీదికా
వాదరదానదక్షిణత నల్లఁగు మేలిజిగంపురాలబ
త్వేదిక నిల్పి నమ్మదుటఁ బ్రేరిత జిగిమించు నతుశల్
వాదనలేని వీణె నఁ బాటలనీటులు *తుల్యు లొప్పఁగా. ౮౯
క. ఈమగు వెలపిల్ల దేనకి, కొమ కిప్పుడు నీకుఁ బెండ్లికొమరై యమరెం
గొడు కగుడు నీకు మదనుం, డుమగర లందఱు సమర కునిదా వింటే.
గీ. అనుచుఁ జెలియలు మధుగోష్ఠు లాడుచున్నఁ
బడతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ
తైలమున నింతితల యంటి తార్చి తీర్చి
నూనముడి సంఘటించెను నూనముడికి. ౯౧
గీ. కులుకుముడిగూడనిద్దంపుఁగురులసొంపు, గుంపుగనుపట్టునప్పేళఁగుందరదకుఁ
దాళతళ్యంబుమీఱుఁగఁ దైలరసము, వలపిదిద్దినమరునికృపాణియనఁగ.
గీ మచ్చికంటులుమోదంబుహెచ్చిపచ్చి, పసుపువలఁగార్చినప్పుడప్పడఁతిమేను
దీపయొప్పారెఁగాఁకలుదేరి †మెఱుఁగు,జోకఁ గైకొన్నపైఁడిశలాక యనఁగ.
చ. అలకలఁ గొప్ప మీఱుకుటిలాలకయొక్కతె దివ్యచందనా
మలకము నూన నిగ్గునడిమూనఁగఁ బెట్టెను మేలుతావులం
జిలుకునవాంబుపూరములఁ జెల్వ మఱొక్కతె చెమ్మమిన్నఁగా
జలక మొనర్చె నొక్కచెలి చక్కఁగ మై తడి యొత్తుచుండఁగన్. ౯౪
గీ. వనిత యొక్కర్తు మేలుమవ్వలువఁదెచ్చి,సొరిదిఁ గట్టఁగనప్పుడు సూర్యజాత
నప్రసాదశరజ్జాతజలదపటల, ‡రేజితాకార యగుచంద్రరేఖఁ బోలె. ౯౫
క. చెలియొకతె చెలువయాఁదలఁ, గలతడియుడిగింప నొక్కకలికి సుగంధో
జ్జ్వలధూపధూమ మొసఁగెన్,జలముద్గమములు జన్యజనకము లనియో.

*కొలుప్కా-మూ. †మెలఁగు.పా. ‡దేజితా-మూ.

—। కాళిందిని చెలు లలంకరించుట । —

ఉ. ముచ్చటగాఁగ నొక్కచెలి మోహనగాత్రికిఁ గొప్పు దిద్దఁగాఁ
బొచ్చెములేని మేల్వలపుఁబువ్వులదండల గొప్పకొప్పునన్
మెచ్చుగ నిల్పె నొక్కచెలమీనవిలోచన సాటి గైకొన
న్వచ్చు నరాతులం బఱవ వచ్చిన కీర్తులమూర్తులో యనన్. ౯౭

చ. కుటిలములైన ముంగురులఁగూడి మెలంగెడుకామినీమణీ
నిటలమునందుఁ గస్తురిని నెచ్చెలియొక్కతె బొట్టుఁబెట్టఁ దాఁ
గుటిలతమాన ఫాలమయి కోమలచంద్రుఁడు వంకపూనుచుం
జటిలకలంకముం గుటిలసంగతి మిక్కిలిఁ గాంచెనో యనన్. ౯౮

క. పంకజముఖి కొకనెచ్చెలి, పొంకపుసీమంతవీథిఁ బొందుగ నిలిపెం
గుంకుమచూర్ణం బహితా, తంకముగాఁ గబరి వీరతం దాల్చెనన్. ౯౯

చ. నడుమ మహేంద్రనీలమణి నాయకమౌ మకరాల బొట్టుచేఁ
గడునలరారు ముత్యపుఁజొకాటపు బొట్టు నెలంత కొప్పెడున్
విడువక వీఁక నెచ్చెలులు వెంబడి జాల్గొనిరా మహాభయం
బడి ముఖచంద్రుఁ గొల్చుటకు వచ్చినసింహికశాంకుఁ బోలుచున్. ౧౦౦

గీ. కంటఁ *గాటుకఁ దీర్చె నగలికి యొకర్తు, సరసిజాక్షికిఁ గనుదోయి †సామ్యసాక్షి
దళన మొనరింపఁగోరినఁ దాదృగీక్ష, గల్గుసిద్ధాంజనముఁ బెట్టుకరణి తోఁప.

గీ. ముద్దులాఁడికి నొకబోటి ముత్తియంపు, మేలుముంగర ముక్కున ‡మెఱపునొప్పె
నధరమాధుర్యమాసింప నవతరించు, చెంత మెలఁగెడునమృతంపుఁజినుకనంగ.

క. శ్రీకారసామ్య మాకృతి, నేకాదర్శప్రకాశ నెనయఁ గలదన్
జోక(ను)వీనుల(న)తులా, ఁకపువరత్నకుండలములు దైవారెన్. ౧౦౩

క. అంజనరుచితీవ్రాసిత, మంజులతరపలదపాంగమంజరి మిగులం
గంజాక్షి గండతలమున, నంజ§రుచిరంపుబిందు వందముఁ జెందెన్. ౧౦౪

క అరుణాధరయరుణద్యుతి, శరణాధరసీమఘటితసమ్యగలక్తా
స్ఫురణంబుఁ గనక యొకచెలి, తిరుగన్ ఘటి(యి)ంపఁదలఁచి తెలిసి న్నానన్

గీ. తొలఁగకుండుసువర్ణబింబువులఁ జెంది, మధురబంధంబుగాంచినమ్మదమునించి
సాధువాగ్రీతిఁ గైకొన్న చారుకంచు, కంబులోఁ జన్నుఁగవ వ్యంగ్యగతిఁ జెలంగె

* కాటిక- † సామ్యసాక్షి-మూ. ‡ మేరనొప్పె-మూ. § రతంపుబిందు-మూ.

చ. ఉరుకరిరాజకుంభములయుద్ధతి మానిది తజ్జయార్జిత
స్ఫురితయశస్సితం బగుచు శోభిలుదానికిఁ దద్వయిస్సర
గ్గురుతరమౌక్తికావళులఁ గూడుట యబ్రమె యౌచు నెన్న న
త్తరళమృగాక్షి చన్నుఁగవ దాలిచె గంధపుఁబూత హారముల్. ౧౦౭

ఉ. నీలపుఁ గాలకాంచికయనిందితరోచులు క్రిందఁ బర్వ మర్
మేలగురోమరాజిరుచి *మెఱచు(నుంకుట)నాభి నాను గా
వాలముతో మెలంగెను నవారితనీలరసంబు నించి యు
ద్వేలముగాఁ దనూచ్ఛ్వసితధీ నిరువంకలఁ జేయు నింతికిన్. ౧౦౮

క. చారుకరకల్పవాంకిత,హై రాజిలుబాహులతిక నతివకునమరెన్
హీరమయకంకణాదులు, సారలతాంతముల మేలుచాయం గనుచున్ ౧౦౯

క. మదదంతిగామినీమణి, పదపంకేరుహములందుఁ బాయక నిలిచెన్
మృదుమధురనినాదంబులు, †పాదలఁగఁ హంసకములతులపూర్ణద్యుతులన్

గీ. ‡సహావనత్పతికరత నే నవతి గాదు,కంకణావాస కీశరత్నద్వయన
నిరుపమావేలసౌందర్యనిత్యపదత, నేని యల్లక్ష్మి నవతియయ్యెఁ దువదన ౧౧౧

చ. ముకు(కుఁ)దనంబు(వ)క్రతయు మోయుటమాని నసూక్ష్మవృత్తిగన్
వదలుచు వృశ్చతం గొనుచు వాసివహించినఁ జిత్రరేఖ దాఁ
బొదలుచుఁ §గాత్రికతుణదఁ బూని మెలంగిన యర్ద్ధి పాఁటిగా
మది మాదమావహిల్లుఁ జెలినుండితపేశలదేహయష్టికిన్. ౧౧౨

గీ. కమలలోచనపాణిసంగ్రహణకారి, నిరతిశయభాగ్యవర్ణాళిసీటుఁ గాంచి
నలలితాకృతి ఫాలదేశంబునందు, భామ కలరారె ముత్యాలబాసికంబున్.

—॥ వివాహవర్ణనము ॥—

క. అప్పుడు మహీసురోత్తము,లిప్పుడె సుముహూర్తవేళ యొడలే దనఁగా
రప్పించిరి తెరమఱుఁగున,కొప్పులకుప్పను మదబు లొప్పులు గుప్పన్.

చ. వలితెలిపచ్చడంపుఁదెర పర్వినచ్ఛలిమోము దాఁగనన్
హరిసయిదోడు శారదఘనాంతరపూర్ణనిశాకరుంబలెం
గలికివరాననాంబుజము గన్గొనఁగాఁ దమకించియుం దదా
కలన భరింపదమ్యోఁ బయిఁగ్రమ్మెడు దట్టపుసిగ్గుబత్తెరన్. ౧౧౩

---

*మిగుల-మూ †పాదలకహంసకలము-మూ ‡సహావసత్రపతికర-మూ §కాత్రికతుణతపూన-మూ

క. మధురవ్యాహృతచారము, లధికతరరసాన్వితస్తవంబులు నొనర్చెన్
మధువైరి కట్టెదుటఁ, బథికమహాభాగ్య మొనరుబఱవేలు పొగిన్.

చ. జలరుహరాగనీలమణిసంగతహీరసమంచుపుంభాస్త్రగో
జలరుహనాభపాదజలంబులు భక్తిఁ బసిన్ వారిధా
(ర)లఁగడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దత్తణిప్రభా
కలనఁ ద్రివేణి కాజలము కైవడి పాత్రజలంబు కైవడిన్. ౧౧౮

గీ. సాత్త్వికస్వేదమకరందసహిత మయిన, పాణికంజాతంబు ధారోదకాతిసిక్త
మగుచు వాత్సకరస్పర్శ నతిశయిల్ల, వాతి రవియిచ్చె బ్రహ్మార్పణ మ్మటంచు.

ఉ. చేతనమాత్ర *నిజ్జగతి (శ్రీ)కతిగా మదిఁ బల్పి యాత్మనం
జాత నొసంగు వాఁడు నిజజాతిసముల్లసనప్రదాయి నా
నీతఁడి వాడిదేవునకి యింతిగొనంగినయర్థ్యముండు వి
ఖ్యాతిగ లోకదీపకత గాంచఁడె యంచు నుతించి రుత్తముల్. ౧౧౯

క. తెర దొలఁగ వరుఁడు చెలి వా, తెరసొగసులు గనఁగ మెలఁగఁదివ్రపువురువా
తెరగలుగు(?) తెలిన సిగ్గుల, తెర తమిబిగులంగ మదిని దెరలన్ సాగెన్.

గీ. శుభగుణాస్పద నైనయీసుదతికంత, మునకుఁ దగఁ దత్తనప్పుడు గనిన కంబు
వెల్గు సరియగుననురీతి యింతి† గౌలికి, నిభుఁడు పొందుగఘటియించె శుభగుణాబు

చ. చిఱునగు తేటలం బ్రికుల (శ్రీ)నిరువొందిన ముత్తియంబు లా
నెఱవొర యింతియొఁదలను నిల్పిన వావృతి వైరమూని య
క్కఱిమొగు లంచు వచ్చి రయిఁ గ్రమ్మిన మించులు వా మెలంగ నై
రొలఁపులఁ‡తీఁగనై మెలఁగి రొమ్మున మొగ్గలనిగ్గు నిగ్గుమన్. ౧౨౨

క. వరమాణమధ్య (శ్రీ)గారి, శిరమున ముత్యాలప్రాలు చేదోయి నిడెన్
హారి(తను)వు తత్సితంబై, కరమరుదుగ నపుడు పుష్పఘనమైయొప్పెన్ ౧౨౩

సీ. సరబతి నారి హెచ్చరికమాటలు §తేటమాటలాఁడులగ్ తేటపీటుపాట
లఖిలానవద్యవాద్యారావములు సామముఖవేదరవములు భూరిశాస్త్ర
నినదముల్ దచ్చననేర్పుఁబల్కులు హాసమధురధ్వనుల్ వస్త్రముస్వరములు
స్ఫీతభూపాంగణశింజితంబులు వందిబృందముల్ మాగధస్వానములును
సకలసురమానిమనుజనంసత్ప్రయుక్త
జయజయధ్వానములు నొక్కసమయమునను

*నజ్జగతి- మూ. †గౌలికి-ఇంత మును ‡తీగనై- మూ. §తోటలసీటు-మూ.

గలసికొన నైన యవ్వింతకలకలంబు
చాల దీపించె దోయింటి ప్రాలవేళ. ౧౨౪

క. పువ్వులదోయిటికయ్యం, బవ్వనితావరుల నలరఁ *నందించెఁ గడుం
బువ్వులరువ్వులకయ్యము, పువ్విలుతునినసము నలరఁ బొందింపంగన్. ౧౨౫

వ. అంత. ౧౨౬

ఉ. వేలిమివేళయందు నరవిందదళాయతలోచనామణుల్
వేలిమిపాట రాగములు వింతలువింతలుగాఁగఁ బాడ సం
దోలి నడంగె నారదము ఖోర్జితశర్వరగాయకప్రవే
కాళికరాబ్జనంవస ముదంచితమంజువిపంచికార్భటుల్. ౧౨౭

గీ. ఇంతిహృదయావనచ్ఛిరమేఘమాన, మదనదావానలజ్వాలమద మణంగె
బహిరవిరహితవైనాహవనమిత్ర, ధూమకీలలు మిగుల నుద్దామములుగ. 

క. ఇద్దఱు వేలిమివేల్మి, స్నిద్ధపువజిరంపుఁబీఠి నెఱిఁగదియంగా
సిద్ధలకిఁ గూర్చునాఁడె, యిద్దఱినంమున మరుంను సఱికి వసించెన్. ౧౨౯

చ. పొగ సొగయంగ ముద్దుచెలిపొందికకాటుకకంటికోనలన్
దిగియొమసశ్రుబిందువులు దీర్ఘరుచుల్ దలపించు నీలపుం
జిగిబిగిఁగాంచు ముత్తియపుఁజిప్పలలోపలనుండివచ్చు హే
తుగుణములై(న)ముత్యముల దూకొనుకప్పుమెఱుంగుఁబొంగుఁగన్. ౧3౦

క. పొగనెపమున నొకవంకకు, సొగసులనెమ్మోము సలిపి చూచెను నవలా
పొగరుకిటిచాయచూపుల, మగనితెలుపుటొంట్లు నీలమణులై తనరన్.

ఉ. కమ్మలపచ్చరాపయిఁడికాంతులు చూపులతెల్పుకప్పులో
క్షుమ్మడిఁ బాదపల్లవమహాజ్జ్వలకాంతులఁగూడి పంచవ
ర్ణమ్ములముగ్గునిడ(దన)నాథునివెంటఁ బ్రదక్షిణమ్ము చొ
క్కమ్ముగఁ జేసెఁ బద్మహితుగాదిలికూఁతురు నీటిచూలికిన్. ౧3౨

మ. సనశల్యోకెము వేళఁ బద్మముఖ యంచత్పాద మాద్యత్తరం
బునఁ బట్టంపఁగఁ గృష్ణుమానసముసన్ మోదాతిరేకంబునం
గనకాంగీమణి కబ్బసౌఖ్యమహిమం గంజాస్త్రవీర్యాగణీ
కనదేకాంతవిభుత్వవైఖరులు లెక్కల్ సేయఁగా శక్యమె. ౧33

---

*బొందించె- మూ.

క. నీలమణిమయపునరిక, ల్పాలామణి ద్రాక్షశౌరివరతంత్ర(త)
జాలకొనసడుగురుచులను, నీలోకల వజ్రాగనింద యొనర్పన్. ౧౩౪

ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దులగండతలంబునందు సా
మోదనిశాకకర్దమము పొందుగ నించెను నవ్వులాటకై
నీదుకపోలభాగమున నిండి తొలంకెడు తేటమిన్న యో
కా దిపు డేనొసంగుసిరికాంతులు మేలె యటన్నకైవడిన్. ౧౩౫

చ. హరినను జెక్కుటద్దమున నర్మమనందన సత్యభామినీ
విరచితసంజ్ఞ పూర్వకృతపశ్రుతమైత్రియు హెచ్చరింపఁగా
స్ఫురదరుణంపుఁ గుంకుమము పూసినఁ దచ్ఛవి యొప్పెఁ దేటి (దే)
హరుచిఁగనంగ మోము గను సద్భుతరాగము నీడయో యనన్. ౧౩౬

చ. ముసిముసినవ్వు తేటలను ముత్యపుఁ బాపట చేరు చాయలుం
బసగలముక్కుముత్తియపు బల్లిగయున్ గుమిఁగూడి ధారయై
మసలుచుఁ బోయి మీటకొన మంచిరుచిం దనరెన్ వసిష్ఠుతోఁ
బొసగెను నైదువంగనయొఁ బుణ్యచరిత్ర మొనంగ మ్రొక్కుచున్. ౧౩౭

గీ. పురుషతల్లజు పెండ్లి సిప్పుడు భుజించు
మధురచతురాన్నములు మీఁద మనకు సబ్బఁ
బేర్మిఁ గృష్ణుని కింకొక్క పెండ్లియైన
దిరుగ నతెంచు పుణ్యంబు దీరదని. ౧౩౮

క. అని యెన్నుచు రుచులానుచుఁ, గొనకొనెనను యంబు లెన్నఁగొనుఁడా యనుచుం
దినఁదినఁగ వింత లనుచున్, జనత తదన్నానుభూతిఁ జాలం దనిసెన్. ౧౩౯

సీ. మంచిభోజన మబ్బె మాగధక్షితిపాలసలలితపరిణయోత్సవమునందు
నవి చెప్పనేటికి నంతకంటెను మేలు వెలయు కాశీశేశు పెండ్లిబంతి
యాబంతికిత యేమి యంతకు(మి)క్కిలి బంగాళపతిపెండ్లిబంతికూడు
ఆకూటిపస యేమి యంతకంటెను బాగు వంగేశు పెండ్లిలో వంటకంబు
అవివచింపంగ నహ్యమా యంతకంటె, నెక్కుడై చక్కనై నాల్కసొక్కఁజేసెఁ
* బోల్కిలేసదివారిపెండ్లిబోనమనుచు, జనులు మృష్టాన్నములఁ దృప్తిగొనిరి చాల.

గీ. ప్రోలుసొరఁబడి వెడలుచుఁ బురుషచంద్రుఁ
డురుతరోజ్జ్వలమణిసంయుతోత్తమాంగ
మభినవలతాంతవిశదంబు నగు(టఁ) బాఁప
పాన్పునగియెడు పెడలిపాను పెక్కె. ౧౪౦

* పోల్కి—చెనిడి—మూ.

ఉ. పాటలగంధితోడ హరి పానుపునందు వసించు నత్తఱిం
బాటలగంధు లింపడరఁ బాడఁగఁ బాటలు నవ్వులాటలన్
మాటికిఁ గేలుదప్ప కెడమం గడి దువ్వెడుమారునంపపూ
బ్బూటపునీటు లెన్న నెకసక్కెపుమాటలు మీఱెఁ గార్యమున్. ౧౪౩

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆమెడఁ బదినూఱులబలు, చాయలుగల వేల్పుఱేఁడు సన్నయొసంగం
జాయకొమరుండు దమ్ముల, మాయురుభర్తకు నొసంగు నభిరతి వచ్చెన్.

ఉ. వేయగుపాదములఁ గలిగి విశ్రుతిఁ దీను హిమంబు గాంచుఁగా
చాయపొలంతితో డతఁడు సంతతమై తెగునీరు నెక్కుడుం
బాయవు మాంద్యకంగుతలు భాస్కరుతండ్రికి వీక్ష మిక్కు డే
చాయ నొసంగెదంచు హలిసాత్యకి యుక్తులు నవ్వుచుండఁగన్. ౧౪౪

గీ. మాంద్యకంగుతలన్నచోఁ మానుజార్థ, సమసనంబచ్చటను వష్ఠిజాను మీఱు
ననుచు నవ్వుచు నుత్తరంబాడికొనుచు, హరికి నసితుండు వీడియంబమర నిచ్చె.

ఉ. తెలివి దలిర్ప నాకబలిదీరుఁగఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
దెలిబలు ప్రాసి మోముకళతేటలుగల్గిన గిడ్డి నీగికి
న్వాలయుఁగఁ బంచి తద్ధ(టి)తకిశ్రుతనవ్యయశేష్టవస్తుసం
కలన సమస్తలోకముల గారవ మొప్పఁగఁ దన్పి వంపుడున్. ౧౪౬.

— అప్పగింతలు —

క. అంతట సంతసించినట్టుం, బంతుకరణాంబపారగానందపయో
ధ్యంతరమున నోలాడఁగ, నంతికచరుఁ డౌచుఁ గూర్మి నల్లుని బలికెన్. ౧౪౭

ఉ. ఎల్లజగంబు లేలుపరమేశ్వర భక్తజనావనార్థమై
యుల్లలితంపుమానవసమీహితచేష్టలు గాంచుసామి నీ
వల్లుఁడవైతి గానఁ జరమాద్రికి నవ్వలఁ జిమ్ముచీఁకటుల్
డొల్లఁగఁ జేయుచుట్టిడికటులిమ్ము గాంచు ప్రభల్ భరించితిన్. ౧౪౮

గీ. ఎంతకాలంబునుండియో యెడయకుండ
కటుల మోగ్రస్తత హరింపఁ బాలుపడితి
నస్తమయశూన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౯

గీ. హరణ మొసఁగుట మాకు నర్హమిచట, నఖిలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల,దక్షిణాలోకభర మిచ్చుతలఁపు నాది.
క. హరిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొనరింపుచు నానతి, పరమపురుషుచేతఁ గొను నుఁబలికెం గూఁతున్.
ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపపు
త్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౧౪
గీ. భాగ్యసౌందర్యశీలానపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన,కు సుమసాదృశ్య మొందింపఁగోరవమ్మ.
గీ. అంబుజాతాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుము హరిజాయననుసరించి
హరికథానుగతిస్ఫూర్తి నలరినీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు
గీ. పగలుగావించి మాయమ్మ పగలు సేయు, వానిబిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము. ౧౧౫
శా. అమ్మా మమ్మెడఁబాసితంచు మదిలో నావంత యైన న్విచా
ర మ్మానం బనిలేదు కాంతలకు నబ్రహ్మే యదెన్నంగ నై
న మ్మానక భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ బాయఁ డెప్పుడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౧౬
చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హరణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రి పట్టికిన్
హరణ మొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
వరయ బితృస్వకాంతు ధృఢమై మదిఁబుట్టెడు నట్టిపోటికిన్. ౧౧౭
ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపచారస
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావము పొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనుపట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౧౮
క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తర శేక్షణచే
వనజాప్తు డోకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

క. కుహనారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలకన్యా
మహారణపరఖరదూషణ, సహజావైరూప్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలత్కృపోక్షిత కటాక్షసాదిత పాండిత్యాభరణ ప్రభంజనపం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ
సన్నయభట్టారక అహోబలపత్యాహ్వయకవిమహో
పాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిందీకన్యా
పరిణయం బనుమహాప్రబంధమునందు
బంచమాశ్వాసము

---

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## — షష్ఠాశ్వాసము —

క. శ్రీమత్పద్మజభవహృ, త్తామరసస్థరథ్యాంగ దశముఖభంగా
శ్రీమహిత హితజనాంబుజ, ధామాధిప ప్రముదితాత్మ దశరథరామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. చారుశ్రీజనికరమై, హీరోపలకాంతిపూరహృద్యమగు నై
పారసుధాలయంబై, పారావారంబుభాతి భాసిలు నటియున్. ౩

క. అర్థసమృద్ధంబై శ్రీ, వర్ధనచతురాస్యహర్షవర్ధనపరమై
వర్ధిల్లుగీత మనగ నృహ, మర్త్యాధికసాధసదృశ మగ్రేసరమున్. ౪

గీ. ప్రాప్తమందన మత్యంతప్రాప్తిపదము, సుప్రసన్నసుసంపూర్ణసులలితము
వీణాసాదృశ్య మలరారి వేత్త నెఱపి, యచ్యుత[illegible] జిత్రమహావలయోత్సవము.

క. చారుమహాభోగంబై, భూరిశిరోరత్నకాంతిపూరావృతమై
తోరంపుశేషతల్పం, గేరెకుసుమసుకుమారపుష్పకీలితశయ్యన్ ౬

క. వసియించె వాసుదేవుఁడు, మునిమానసగుహాముఁడమ్మొనయించుప్రసాదం
బసదృశకాంతావిమలము, ప్రసన్నత్రైలోక్యబంధపటిమండెలరన్. ౭

చ. అతికఠినంబులౌ జగతి హాటకరత్నము లెంగయుక్తి నీ
దతిమృదు వెల్లు పాండెనఁగు నైన ననుం బటులేని భూషణా
వృతికిది వేళయౌ నటంచు *వేగసమానవిభూషణాళులన్
నతిఘటియించు మంచు రవిజాగ విభూషితఁజేసి రంగనల్. ౮

శా. సారోదాత్తవిశేషచిత్రకవిభూషాకీర్తి సమ్య†గ్గుణో
దారవ్యక్తి ‡సువృత్తి దోషరహితోద్యద్వర్ణ ధన్యోల్లస§న్న్యాయనీ
నీరేజేక్షణఁ గావ్యలక్ష్మిబలె (1)మన్నిద్రాక్షభత్వాస్యమండె
మారుం డప్పుడు చూచి రోసి వదలెన్ మన్నించె కాత్యాస్త్రముల్. ౯

క. (న)తియంగంబులఁ బొంగడము, నతులప్రాణావళి సముంచితమాచా
గతుల ద్వితీయతృతీయ, ప్రతిభటరహిత ప్రటలంక(౧)నయుగ(2)మొనసెన్.

---

* వేగసమానసమభూషణా † గుణాదారా- ‡సువృత్తి- § న్యాయకీర

(1) మన్నిద్రా- (2) మొనసెన్-

చ. చెలులతఱిప్రయత్నమెు(గఁ)జిమ్ముచుఁ గమ్మవింటివానిపూ
ములుకుల *క్రొవ్వడంపుఁచు(ను) మొప్పిరిఁగొన్నను రాగగర్వమున్
నిలువ(వ)దల్చుచుం జెలువ నిల్చెను నొక్కఁడు గొక్కకుండ నిం
తలు భళిరా భళీర మదిఁ దార్కొను సిగ్గుకటుత్వవైఖరుల్. ౧౧

గీ. మదనుఁడను కర్ణధారుండు గదియునే, హిమసుడి యను నావ శోభిల్లునని
వేకరంబుల నరదారబిక్షయే, చెలువ దాటంగ లేదమ్మ సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమివేగము ముందఱికీడ్వ నన్యథం
జనున సహింప †భావము సంధియుమధ్య మభావమైచనో
ఘనకుచ‡భారధారణము గాఁ జన దంచు వదింతు వచ్చునే
ఘనవదనా యొయించి కలకాలము §యుండెడి దాని గానమే. ౧౩

క. వెడవింటిజోదు విరివి, గ్రుడుసుగదం జేయఁ జేయ గురుకుచ కొక్కా
క్కాను గామడకుం గడచిన, గడుదూరం బయ్యె లజ్జగరిమం బంతో. ౧౪

చ. అలవలరాజు పైదలి రమాధిపు(కజ్జకు) వేగఁ (1)జేర్చఁగా
వలనుదలిర్చ నూఱటలఁ బాయుచు గుప్పెడుఁ బువ్వుబాణముల్
చలనము లేనికూర్మి నవసంబయి మించిన లజ్జ జాఱగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గ్రమ్మను సిగ్గున సిగ్గులాఁడి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బయిచల్వపుఁ గ్రొమ్ముసిఁ జిమ్ము చీఁకటిం
గలసి మెలంగు పాపటచొకాటపుఁ జెంద్రపురేఖ చే మనో
మిళదనురాగవైభవము మించఁగఁ జాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు సత్వరితగామిత యున్ఘ్రుల కెన్నవం చొగిన్. ౧౬

వ. అప్పు డొక్కచెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యిట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగ నేగెడు వన్నెలాఁడికిం
గ్రొత్తయె లజ్జ లోఁగొనుట కూర్మిచెలుల్ గడితేర్ప తేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁ జేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తటినైన విన్నయది యే కను లొక్కెడిమాట యుగ్మలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంతకిట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, ఘటుకరకుచకుంభనజ్రకంజరసీమన్
ఘటియింతురు సజలీలల, నిటునటుఁ జననీక జీవితేశ్వరుకమున్. ౨౦

(*) క్రొవ్వు. † భావము. ‡ భావధారణ. § కండెడి. (1) జెప్పగా. (2) తోన్

వ. వెండియు నొక్క తేటచక్కులాఁడి యచ్చక్కనికొమ్మ కిట్లనియె ౨౧

క. నను పైనపూలపాన్పున, మననూరుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కెల్లలేదు మంజులవాణీ. ౨౨

వ. పిదప నొక్కబింబాధర యయ్యంబుజబింబాస్య కిట్లనియె. ౨౩

క. హరిఁ గూడక తుణ మైనం, భరియింపఁగ రాదు మేనఁ బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నప్పుడు, దరియా(వక) యిట్టిలజ్జ దా నెటుపనునో. ౨౪

వ. మఱియు నొక్కప్రోడ యబ్బేడిసకంటి కిట్లనియె ౨౫

ఉ. అప్పరో నీవు నీమగని(యందపు)మోమ్మున లచ్చిరీతి నీ
వొప్పులఁ గుప్పచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గెం
పొప్పను నీకుమోవి దళనోదితరాగ మతండు సేయఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యెంతుఁ బోవునో. ౨౬

వ. అంత నొక్కనిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె. ౨౭

మ. ఉరులజ్జాధర*గవ్వారంబునను రాగోద్వృత్తి కేవేల దా
పరముం జేసెను మర్మముం దెలియు మావజ్ఞా వృథా గాదె యె
వ్వరికైనం గనఁ దేటఁ జెంతు మదిలోఁ బాటిల్లురాగంబు శ్రీ
కరవక్త్రాంబుజరాగనామకమహాకర్ణేజపం బంచుటన్. ౨౮

వ. అనంతరంబ యొక్కకృపుధునితంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు సేయు ఫల మేమని చెప్పినఁ గాక సేసె దో
కాంతరొ గట్టివాయి యని కాంతుని నెమ్మదిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కెందఱో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. 30

వ. తరువాత నొక్కయుగ్మలి యక్కోమలి కిట్లనియె. 3౧

క. అతినిబిడంబజ్జగా దిని, సతికి స్మదిలోన నువిద సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార మెడసి యున్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నీలవేణి నగ †వాఁగుచు నెచ్చెలులన్ పడించి యో
చిత్తజుకుల్కి కల్కి విరు చిత్తము నిల్పుచు నాదువిన్నపం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు పసంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగ నెంతయు నంచుఁ బల్కఁగన్.

* గవ్వారము=నెపము. † వాగుచు.

మ. లలనామన్మథ*మూర్తిదృష్టి విలసద్రాగావగావేగనం
†కలనాదివ్యదవత్రపాధుని నమగ్నా ‡సీఁ దితభ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విజాధినాయకమణిస్తంభంబు నందం గొనన్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాగునఁ గౌఁగిలింతు నే ననుక్రియన
బ్బాలిక కౌఁగిటఁ జేర్చుచు, నీలస్తంభంబు సిగ్గునరయాం గ్రమ్మఁగ. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి ముందట నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసద్గ్రకరనందనాసుందరేందు రేఖావిలాసనముల్లాసబలప్రబ(ల)విధవదంతరామోదజలధిఫేనాయమానం బగు మందస్మితంబు ముఖాంబుజంబు నలంకరింప ని ట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, గలిగినభాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁగన, వలయుచు వచ్చుటయె కాని వార్తలు గలవే.

క. అలికుంతల క్షణదాముఖ, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలివిఁగొను కృష్ణపక్షము, వలగొను నీక్షణదముఖము వదలు నెలమునన్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాకు రంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూషణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఱకు నిడి వెడలి చను సంజ్ఞ నవతరింపం జేయఁ జాయకట్టికి నీచుట్టుఁ బట్టినదార వంపు వెట్టినవను లకుం జనిమొద మమ్మరో తిరిగి వచ్చెద మిచ్చట నుండు మని మురుంగుగాఁ బల్కి యచ్చెలుకలకొలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తిప్రవిలాసవైఖరుల నంచద్భ్రూభలు నర్తిల్ల ల
జ్జితసంవిస్మితకాంతమౌక్త్యలలితశ్రీవీక్షణాళీసితా
సితవంకేరుహమాలికన్ మదనకాంక్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి తేని కొనఁగెన్ సేవార్థమా కానుకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ డ
క్కామునితండ్రిఁ గామునిచొకాటపుబాణము భామ చూచు చుం

* యత్న † కలనందివ్యపదత్రపా. ‡ నిందితభ్రాంతిః।

మగువ నీకబరి మన్మథకరాయుధముగా జాలువాఱఁ జలపోఁతజాను గాంచె
భామ నీభ్రూమ్ముడి బర్హిబర్హంబుగాఁ జంద్రసంబంధచారు వయ్యెఁ
చెలువ చిత్రాళిపాళిగాఁ జికురభరము, సరసతభరించెఁ జంపకచ్ఛాయఁ డాయ
ననుచునఖరోచులంతటనలరుచుండ, గొప్పమాప్పెనఁ గోవిందుఁ డొప్పమీఱ.

చ. కలికిరో మోము వాంఛటకుఁ గారణ మేమి కలంకిచంద్రుబిం
దులఘుటియింపఁగాఁ గలుగు దుష్టుల పల్కుల సైఁపలేకనో
తెలివి(ని)దప్పి పామరు లతిత్వర సామ్యము పల్కినంతనే
కలుఁగున సాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ............ తోఁపట సాటి ప్రొద్దు రా
మిక్కిలి మారుపంకజము మిన్నక పండితమాన్య లీమృషా
వాక్కుల కేల జిహ్వ యలవచ్చిరి పంకజవైరి చంద్రునే
నుక్కడఁగించుమో ............ యనందగునే పయోజముల్. ౬౧

ఉ. పంకజనీలపంకరుహభావము దాలుచు కన్నుదోయి మే
ల్పొంకము సైఁచునీదు ముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యీ
పంక(జబృంద మెల్లఁ దల) వంపులకుం దగఁగాక యవ్వ్యర్థమే
పంకజ*నేత్ర నీకుఁ దలవంపు లహేతుకలజ్జ మెత్తురే. ౬౨

గీ. వనితరో మోముచందురు వాంఛదేల, కుటిలకుంతలతిమిరంబు కోర...
...నో యనుశంకనో వచ్చుపెట్లు, సిటలపాదెందు నేమించ నేరదెద్ది. ౬౩

సీ. చెలువ లజ్జను మోము వాంచితి పటన్న
నవధరించితో నీవు ముఖార్ధహాతిగ
విను ............ హాతి దాన నెనయు నెట్టు
లదియు నొకచోట దోషత నంద దరయ. ౬౪

ఉ. మృగమదచిత్రకాకృతిని మీఱుకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁడేతదా(కృతివహిం)చు నటంచును మోమువాంచుటో
మృగ మసుగంధ మప్రియము మమ్మృష్ట మశృంగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంకమే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మే లగుఫాలము పిల్లతేఁటికిం
దగు లగుకేతకీదళము దా సగుసం చొగి నెంచి కొప్పపే

* సెల్లి † మదుదేశదా

రగవదుతేఁటిగుం పెనసి యాడెడునందపుఁదేఁటిపిల్లల
న్నగు నగుగాదు ముంగురులు నవ్యవరోరుహవక్త్రలోచనా. ౬౬

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనా భావితద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ, సూక్తియన నొప్పుఁ గస్తూరిచుక్కబొట్టు.

ఉ. పిన్నఁదనంబు వక్రతకు పేరువడం దగెఁ గాని లక్షణం
బన్న నెఱుంగనయ్యె నని యయ్యరచందురమామ పోగనీ
వెన్నుడు రైజనించి కడు నేర్పునఁ గైకొనియెన్ మృగీమదా
ఖన్నతమాలవక్త్రరుచిఁ గీల్గొనులక్షణ మోమృగేక్షణా. ౬౭

చ. లలితపుబొట్టు ఫాలముఁ గలంకి నొనర్పఁగ నర్ధచంద్రుతోఁ
దులఁ గన దన్నమాట మదిఁ దోఁచిన వాంఛితె మోముఁదమ్మి యా
యలికమునందు నందమగు *నట్టిడి బొట్టిడి దోషకారియే
యిల వ్యతిరేకభూష వచియింపఁగ హేతువు కాక కోమలీ ౬౮

గీ. చవుతి చందురుఁడలికంబుచక్కఁజూడ, మాకుపాలంభమగునని మాటుకొనితె
యది యుపాలంభవిషయతనందకున్న, నదిఘటిల్లుటవ్యతిరేకమగునుభూష.

చ. రసవదమై మృ(దు)త్వమున రాజిలి లక్షణలక్షితంబునై
హసన మొనర్చు సాధుకృతి నందపునీనిటలంబు దుష్కృతిం
గనరఁగఁజూచు సామియయిగాంచిన చందురమామ నిక్కమో
యసదృశగాత్రి లక్షణము నందినయందము పొందుకుఁ జెందమిన్. ౭౧

చ. మొయి లెడఁబాయుపూర్ణశశిమాద్దుఁగనిచు(చు) రాణించునో
పయిపయిఁ గ్రమ్ముమం చెదయు పద్మము రీతి మెలంగ నేర్చునో
దయిత యవక్త్రపాథరము తారఁగ నీమనోజ్ఞవక్త్రమే
మొయివిలసిల్లు సంశయము మేకొను నిచ్చట దానిఁ దీర్పవే. ౭౨

చ. వదన మవక్త్రపాతిమిరబంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం
జిదిమెడు చందమామ నగు సేయక యుండున తప్పుఁబల్కితిన్
వదనము సిగ్గుటిర్లు పయిన్రాలఁగ నేనియు నప్పుడున్ బలెం
బొదలఁగ నిర్లవేళ రుచిపూనని క్కలతేఁదు నవ్వనే. ౭౩

గీ. కాంతిన(వ)న్నవస్తువుల్ గణనసేయు, వశనిమోముతరువాత వెలయఁజంద్రుఁ
డట్టిచోట వికల్పంబు పెట్టరాదు, నసను లనుకల్ప మది యని చదువరాదు.

* నట్టిడి-

చ. నెల యిది యైన మన్నయనసీరజముల్ వికసిల్లునెట్లు దా
నెలయ రసా(ంబు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహంబు గానిచోఁ
గలిగెడు నేఁగలిన్ భ్రమరకంబులసంగతి దమ్మియైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు సంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. వీనులయాం దం(లం)కృతిగఁ బెట్టినసీలపయోజపత్త్రముల్
భానుతనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి భరించు నన్నమా
టానఁగరా దొకించుకయు నానఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి యై ముగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నెలఁ బ్రసిద్ధిగఁ గ్రోలు చకోరపుల్గులై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ నద్దెలొందు నీ
యాయతనేత్రముల్ మెలఁగు నౌర ముఖాక్షివిచిత్రవైఖరుల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోడ్పున మోముఁ జంద్రునందు మెలఁగుచున్
సురుచిరసీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁ జెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదసమ్మోదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుదొలఁగ
నెరి మొగంబెత్తి చూడవే సిరులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గువడువేళ దప్పనే సిగ్గులాఁడి, నన్ను మన్నింపఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపులపేరుగొన్నపరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంచెదె మోము సద్ధినం
తాపము వాప సంపదఁ దక్కువె చంద్రుడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి*వేగుగాంచు, కన్నులకునిప్పుడుం బెనుకమలములకు
సాటిఁ జెప్పంగనమరునే సాటియగును, నెలకునలరెడుజలజంబుగలిగెనేని. ౮౧

మ. అరమోడ్పైననుఁ దొంటికన్న † నెఱియానందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెల్లసాటి యనఁగావచ్చున్ (వ)సంకోచతన్

---

* వేసు † నెరియానందంబు.

పరసత్వంబుఁ దొరంగి చూడ వెగటై సత్త్వాంతికిన్ దూరమై
ధరలో నుండెడు వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౧౨

క. విలసనమహిమం బెంతే, కలిగియుఁ దంచుట్టుఁదిరిగి కలయఁ జతురిమం
బలవదమి దూర్యశముక, జ్జలమై పైనాడు నీదుచక్షుర్యుగమున్. ౧౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మీలనాలంకృ(తి)యొనర్ప మెఱుఁగు గాదు
రూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల నుత్ప్రేక్షఁ గావింపు సొగసులాఁడి. ౧౪

ఉ. అద్భుతరంగల *న్నిగుం నప్పుకుఁ దప్పదు కోవ మంచు నీ
విప్పుడు చూపు చాలుకొననీక పెనంగెడో యట్టులైన నో
రొప్పులకుప్ప కొప్పుజిగియొప్పఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయ నప్పుమదిఁ దప్పనితోఁచు బెఱుంగవైతివే. ౧౫

చ. చెలువగొ సర్వలోకముల చేతుల మొద్దులు గాటిఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మొద్దుబెఱుంగ నేరికిం
దలదలగన్ను వేదలి(యఁ)బాయుమ †సన్నఁ గృతార్థఁ జేయు మం
చలికులవేణి సిగ్గువడు న జలి సేసినఁ జక్కఁ జూడవే. ౧౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీవు కెంతటి కాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీదు మోవితోఁ
జుట్టటికంబు సేయునతిసుందర కుంజరకద్రాగము
గట్టిగ దొండపండదుచుఁ గ్రక్కున ముక్కున‡కొక్కుఁ జూచితే. ౧౭

ఉ. వీచులభూషణం బగునవీనమృదూత్పలముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వాని కవిగీతము శ్రుత్యవతంసభావముల్
గానఁ దదంతరాయఘటకత్వ§మయుక్తము కన్నుదోయికిం
బూనిక తొప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౧౮

ఉ. కన్నుల క్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
ఖన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
పన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నగ నేగి ముచ్చిలికిఁ జేకుటకై జతనంబు పూనెనో. ౧౯

* న్నిగుటు † మన్న ‡ నొక్క § మయుక్తమ

గీ. వనితయరగన్నుఁ గ్రేగొనిమ(వ)సు దెలియ, నాత్మ భావించదో యట్టియాత్మ నీదు
తనయు బల్మిని సాకారతను భరించి, చాతుమంబో ముకుందుఁ జక్కఁగఁ గను ౯౦

గీ. వారి ప్రకృతాత్మతాప్రభావత్వమునయ, నత్తి వద్దంబున కువీక్షణాన్వయిత్వ
మేలదయ సేయఁదలఁపవు హేతువేమి, గర్భసాదృశ్యముబ్బి నకతన నిటులొ. ౯౧

ఉ. చక్కగ నాక్కుపుల్గులిది చక్కెర యోపినయంత మెక్కి యీ
చక్కి మహోక్తమాట వినసంగతిగాని తెలుంగుగా రొదల్
మిక్కిలిఁ జేయుచున్నయది మిన్నక యుండదు నన్నుగాఁగ నో
చక్కగబొమ్మ చక్కగకుఁ జక్కెరయొమ్మదులోక్తిఁ బల్కవే. ౯౨

క. నెలయందుదు తామరయని, పలుకుదు రీమోము బుధులు భవ్యామృతముం
జిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గుఱుచవటి చెదే ౯౩

క. చిక్కను నాదగుభావము, నిక్కముగా నరచితంపు నెఱిపల్కులకుం
జక్కని చెలిరో యివ్వదు, చిక్కెదు నీమధురవచనశృంగారములన్. ౯౪

క. రాలుగరఁగించు నేరుపు, చాలఁగ నాకబ్బు ననుచుందురు గర్వం
*బేలా చల్లింపఁదలఁతు, రాతెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫

క. రూపవతి మామకశ్రుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీదువదనం, బేపారెడు పూర్ణచంద్రుఁడే నిజమయినన్. ౯౬

చ. పరుషము తోచు నీరసతపట్టయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరవహనక్లమాన్వితతఁ బాటిలు రత్నమయోరుకుండలా
భరణము లేల వీనులకుఁ బంకజబంధునికూర్మికట్టి నీ
సరసమృదూక్తి భూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭

క. శృంగారవతి కుచద్వయి, సంగత మగురీతిఁ బల్కు సంగతము దగున్
భృంగాలక నిలువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮

గీ. అరిది మాధుర్యము త్తరోత్తరముగాఁగ, వస్తువుల నెన్నఁ బంచమి ప్రథమలమరు
సార‡భూమకుఁ దస్విమెచ్చుట కునీకు, మధురసూక్తికిఁ బయి నెన్నఁ బ్రథమసున్న.

క. ప్రకృతిర్వికృతిస్స్యా(?), ప్రకృతి నీకవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి ర్వికృతి స్స్యా(?), ప్రకృతి న్నిరసించువారు పలుకుదు రింతీ. ౧౦౦

గీ. వనజలోచన నాదుగాయనత కొప్పి, యమళ్ళ(?)వై పాటపాడవో యబ్బ మొదవఁ
దరుణి నాగాయనతనమ్మతంబుగాక, కొదవెఱుంగక యోగ వయ్యేదవో చెపుమ.

---

* బేలచలింపందలచెదు † చెక్కులలంకరించి ‡ భూమస్థ

క. చంచలనయనా చంచల, చంచల*వీణాధరించి చతురతచే వా
యించెదవో ధ్రువవీణ భ, రించెదవో తెలుపు మాదరించి కృశాంగీ. ౧౨
గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోనలైనఁగ, మానసాంభోజ మభినవమాకరంద
మాధురులఁ దేల నీవేళ సాధురీతిఁ, దేటగీతి పఠింపవే తేఁటికంటి. ౧౩
క. నాలుగువిధముల నభినయ, లీలలు నీకంటెఁ దెలివిలే దన వశమా
యాలోలనయన యిక్కువ, పోలినయభినయముఁ దెలుపు†ప్రొద్దుచనుటకున్
గీ. కలువకంటుల‡కిన్నరకంఠిపదము, యోగరూఢత నీయందు నొనరఁబూను
ననుచు జనులాడుకొనవింతు నదిసఁబంబొ, కాదొ తెలియఁగనగుఁ జాటకతనమాకు.
మ. అతిరక్తాధరసన్నిధానమున నాసారూఢముక్తాఫలం
బతిశుద్ధం బతిరక్తమయ్యె నిది యన్యాయం బుపేక్షింప నీ
వతులజ్ఞానసిధానమూర్తివిగదా యజ్ఞాతి మందస్మిత
ద్యుతిమాత్రంబున దానిదోష మెడయం దోలం గటాక్షింపవే. ౧౬
గీ. ముదిత నీముక్కుముక్తాఫలముత్యమునకు, నాత్మశుద్ధగుణప్రాప్తి నగునతద్గు
ణంబు రూపింప నన్యగుణంబుఁ గొనఁగఁ, దద్గుణాంబుఘుటిల్లుఁ జిత్రంబు కంటె.
గీ. జ్ఞానదీపంబున నవిద్య ననఁగ శుద్ధ, మాత్మరూపంబు దీపించు ననువుదోఁప
వెలఁదినీనవ్వు నను గెంపువిచ్చిపోవ, గాననగుము త్తియము శుద్ధభావమగుచు.
గీ. వికసదంభోజపూర్ణేందువిధముఁ దెలుపు, ముద్దునిద్దంపునీనెఱిమోమునందుఁ
జిలుకన వ్వైన నిఁక నేమిచెప్పవచ్చు, మధురసామృతవిభ్రాంతి మానదింతి.
మ. తెలియక మోము వాంచుకొని తేటలనవ్వులు దేరనీక యా
వలనున నున్నఁ జంద్రముఁడు వారిజతుల్యముగాన మోము నే
వలముగ వాంచియుండెఁ దనవాసియ గల్గుమొగంబు వెన్నెలల్
‡సిలుకకయుండునే యని హసింపఁ దలంపులు నింపఁడా చెలీ. ౨౦
క. ఈమూర్తిఁ బలికి యాదవ, సోముఁడు లేనవ్వు పూర్ణసోముని నవ్వన్
భామామణి నెఱసొగసుల, మోమునఁ జెలువారఁ దనదు మోము ఘటించెన్.
క. నెల నెలయు(ను) వెన్నెల వె,న్నెలయును నత్తమ్మి తమ్మిసీటునఁ గదియం
గలసొగసుఁ జూడఁ గలువల, ములుకులవిలుకానికపుడు ముచ్చటయయ్యెన్.
గీ. అజ్జగద్గురునుపదేశయత్నమహిమ, భావమున నించు ప్రేమానుబంధపటిమ
వారిణలోచన తాదృశాత్యంతిఁ జ్జ, విష్ణుమాపఁగ సాగె నవిద్య పోల్చి. ౨౩

* వీణాకా- † ప్రొద్దుచ్చుటకున్ ‡ కిన్నరకంఠి ‡ సిలుగక.

క. ఆపడఁతి కొంతలజ్జకు, కొంకం బెనయంగఁ బ్రేమలుప్పొంగరఁగా
దీపింప బదులొసర్పఁగ, వ్యాపారముదక్షి కృతము నామోదించున్. ౧౧౪

సీ. సుకుమారవర్ణసంఘటితవ్యాపారంబు లలితప్రసాదన లక్షితంబు
ద్రుతికరమాధుర్యధుర్యస్వభావంబు సవిశేషపరివృత్తితాంచితంబు
పతితిరస్కృతవాచ్య మవిహీనదోషసర్వస్వంబు రసికానురంజనంబు
నగుచు సత్కావ్యంబు నందంబు గొనియొని సవిమ్మృష్టసద్విధేయాంశమగుచు
ప్రీకపదమై పునర్దీప్తి విస్తరిల్లి, భావనాస్ఫూర్తుల కనంగపోషణముల
కాటపట్టుయియొకవింత తేటఁగొనియె, మోముసీదని వెన్నుండుమూరుకొనియె.

గీ. సాత్త్వికస్వేదజలసుధాశ్రయుతఁగాంచు, నలికచంద్రుఁడు విశదముక్తాళిపేరు
గన్నయాత్మీయపేశలకాంతిధార, ఘనపదంబునఁబ్రోచెఁ గలికికంటె ౧౧౫

మ. * ఉపమానాన్వయరూపకస్ఫురితమై యొప్పారుచుం జిత్రకం
బపరక్లిష్టతఁ జెందెనేనియును † వక్రాభిజ్ఞమా భాగ్యవ
ర్ణపదత్వస్థితిఁ స్ఫూర్తనరపత్రాంగంబుఁ బద్మేక్షణుం
డపరిచ్ఛిన్నరసాదృతాశయత మాద్రాక్షిస్నిటాలస్థలిన్. ౧౧౬

గీ. చాన మోము విశేషోక్తిఁబూనదిపుడు, సామ్యమందమిగుణహానిజాడఁజొరమి
నునయనాంజనకవులకుఁ జాడనమరు, భావరసదృష్టు లందుటఁ బద్మనయన.

చ. భ్రమరవిలాసముల్ సభరభవ్యతరోత్పలమాలికల్ కటా
క్షమునన చేసి మీలఁ ‡ విశిస్వరత లలితంబుగాంచ నే
త్రములు భళీర వైదుషి యుదారత యంచొగి నెన్నుచున్ రమా
రమణుఁడు చేసెఁ దన్నయనలక్ష్మికిఁ జుంబనలక్ష్మిఁ దోడుగన్. ౧౧౯

క. కంబుధరాధరసంగత, తాంబూలరసంబుసోఁకి తరుణోందువిభా
చుంబితనీలాంబుజములు, చుంబించెను సూర్యజాతచొక్కపుఁగన్నుల్.

క. హరికృతచుంబితపరిచిత, సురుచిరతాంబూలరాగశోభితదతుల్
తరుణ(శశి)కిరణచర్వణ, నిరతచకోరములనీటు నెఱపఁ(గ)సాగెన్. ౧౨౦

గీ. మురవిభంజనుఁ డవ్వేళ ముద్దుగొనఁగ, రమ్యతదధరవీటికారసము నయన
పద్మములనత్త నుద్వేలబహుళరాగ, రసము వెలికుబ్బెనోయనరమణగాంచె.

---

* ఉపమానస్వాయ † వక్రాభిజ్ఞ ‡ విశస్వరతల్ సిలతంపు.

క. పంకజముఖకనుకాటుక, పంకజలోచనునిమోవిపయి నవ్వేళం
బొంకమయి కనఁగనొప్పెన్, మంకెనవిరిమీఁద మెలఁగుమధుప మనంగన్.
గీ. సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పునందె నపుడు
సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పునందు టరుదె.
గీ అబ్జహితనందనామణియనుభవింప, మరుఁడుమాధుర్యరసముంచిమపినిజాంక
ముద్రయిడి నిల్పు రాజిల్లు విద్రుమంపు, నాళమననొప్పుఁగాటుకనలుపుమోవి.
ఉ. కాటుకకప్పు మోవిజిగి గాదిలినవ్వును బొత్తుఁగూడుచుం
గైటభదైత్యవైరిముఖకంజమునం దనరారెఁ జూడఁగా
*మాటికి సాటియైన రసముఖ్యము లాదిమశోణశుభ్రముల్
మేటిప్రబంధరాజమున మేళన మంది మెలంగునైపడిన్. ౧౨౬
మ. తొలుత న్నందునియింటిలో మెలఁగి సీతోఁబుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణమునంరక్షించి తీమీఁద నీ
వలచుం జెక్కిటఁ గేళిపత్త్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబునుఁ బాసుపాల్యమె కనంగా నోఁచితిం గోపలీ. ౧౨౭
గీ భవ్యగండద్వయికిఁ గేళిపత్త్రములకుఁ, బొందుఁగానఁగూడదన్యోన్యభూషణంబు
పుట్టుమొదలుగ బలుగండములకునోఁచు, నట్టియవిభూషణతకర్హ మనఁగనగునె.
గీ. అతులవాసన నచలభావానుభూతి, ససమమార్దవగుణమున నప్రతీత
శాశతశ్యంబుచేఁ గదా తరళనయన, గలిగె నీచెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.
గీ. అసితపక్ష†లగత్నుహినాంశుఖండ, తుల రొయుసంగిననమృతంబు దొలుకవలదె
కలిమిలేములు దెలియంగవలయుమాకు, ననుచుఁ జెక్కిలినొక్కె శ్రీహరిముదమున.
గీ. మించుటద్దంబు నీచెక్కు మించునంచు, నెంచుకొనవిందు నదినిజమంచు నెంతొ
నిందుబింబాస్యనాతొగంబిచటనిలువ, నమలినచ్ఛాయప్రతిబింబమున్నెనేని.
గీ. ప్రకటదర్పణరుచిరేందుశకలములకు, నువిదనీచెక్కుల(కుఁ)జానరుత్వమనుచు
బుధులుపల్కుదురిటదోషబుద్ధివలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.
చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁగస్తురిచుక్క‡బొట్టులోఁ
గటికికలంక మానసుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ సంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే పచింపఁగాఁ
గుటిలవినీలకేశి యని కూర్మి నొనర్చును జుంబనం బటన్. ౧౩౩

*మాటుపబాటరైన †గళన్నహినాంశు ‡బెట్టు

క. *పాయదు సంహాస్ఫురణముఁ, బాయ దనంకాశరూపభావాస్పదతన్
†ఏయనువు మంగళమహా, శ్రీయను నత్యుక్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుకయేని లీలఁ గొన దీకలు వీనున కేగుదెంచి నీ
యంచితనేత్రముల్ దఱుము నంతికకర్ణమహాధునన్నిధిం
బొంచెను భీతిఁ గూపములఁ బొందవు నేత్రము లంచు మీలస్రు
క్కించినవాని కట్టిభయకీర్తన మొప్పెన కాచె నృత్పురన్. ౧౩౭

ఉ. కర్ణవతంసనామ మిటఁ గాంచెద దృక్ప్రభ నంచు వచ్చి యా
భ్యర్ణము సేరెఁ గావలయు నద్దిర యీయసితోత్పలంబు దృ
గ్వర్ణపరంపరాంతరధినాసతఁ గైకొని లీన మయ్యె ని
క్కర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ. ౧౩౮

గీ. కర్ణమునఁ గల్వ కనుచాయఁ గప్పుకొనఁగ, మీలితంబయ్యెఁ గంటి వేలాలితాంగి
యింతిసామాన్య మిచ్చట నేలకలుగు, మహితధర్మవిశేషసంబంధ మొదయ.

గీ. బ్రహ్మమనవోపృశ్రుత్యంతలక్ష్యమగుచుఁ, దనరు నిక్కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁ బలుకు, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యీకల్వ శ్రుత్యవతంస మగుచు, నాత్మరూపంబు లక్షింప ననుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెనయ దెట్లు, దృష్టివిశ్లేషమున నది తేటపడదు.

చ. కలువలు వీనుల న్మెలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ బేటల సాటగునంచుఁ బల్కుచోఁ
జెలివిటఁ దప్పువారలకుఁ దెల్పఁగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి వదరుశుచిరసం
బతితీవ్రత వెడలించిన, గతి నున్నది వీనులందుఁ గలు వోచెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయదొ కంటివెఁ దామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపె జ
త్వరసముతో ననం దగియె నంచొగి నంటెను రెండువీనులన్. ౧౪౨

*బాయదునఘుస్ఫురణము—†రొనయవు

గీ. మృదుతనవికలభావత మెఱసినల్ల, వాదులకు నెల్లఁదానయీఁ దగుచునుండు
నీదుశిష్మ్యాని యధరాఖ్య లేమ ముఖ్య,వృత్తి విపరీతలక్షణ వెలయ నింతి.
గీ. అతివ నీమోవి యపవర్గమగుట కేమి,కారణము గల్గు నది తేటగా వచింపు
మార్గ తెలి పల్కె నదిపరమామృతంబు,గాన పవర్గభావంబు గలుగుటరుదె.
గీ. గరిత బింబోష్ఠియనుపేరు గలదునీకు,నచటనుపమానవాచ ం బంద్రుబి బ
శబ్ద మష్మాటసిద్ధాంతసరణి సారదు,బింబమిది శేషము లుఁ ప్రతిబింబములుగ.
క. మృదుతన్ పత్కృతిరసనం, బదతం దనరారి పత్ర్రబంధ మ్మఁ దాఁ
బొదలి యను హాసపదతఁ, వదలదు చిత్రంబు నీదువాతెఱ కంటే.
గీ. వెలఁదినీమోవియపవర్గవృత్తి గాంచుఁ, బల్లవచ్ఛాయరాగనంపదలఁ బొదలి
హాస్యపద మగునపవర్గ మబ్బుటరుదు, పల్లవాకృతి రాగసంపదలు పొదల.
ఉ. ఇంతిరో మోము చంద్రువిషయిత్వము సైఁపనియట్లుఁ గెంపుమో
వంత సుధారసం బనఁగ నధ్యవసాయసహిష్ణుతాగుణా
క్రాంతము గాదొ తద్రసము కాదగునో యమృతంబుఁ గొంటి ము
న్నిం తిది నిర్ణయింతు నని యింపుగఁ జేసెను జంబసూతుల్. ౧౫౮
క. కెంపునుమోవి లత్తుక, కెంపు ఘనంబయ్యె మిగులఁ గీల్గొన నెఱడా
లిం పగువిడెమున మిక్కిలి, సొంపెసఁగెను రాగమహిమ సురదక్షతులన్.
క. నగుచాయల ముకుముత్యము, జిగితోఁ బలుగంట్లు నిండి చెన్నలారెం
దగుమోముఁజందువలనం, దిగజాఱుచునుండు మేలుదివ్యాన్న మనఁ.
క. మృదుపదమై రసవాసన, లొదవి లసత్కావ్య మనఁగ నొప్పెను నధరం
బుదితరసోత్కర్షం బై, ముద మొసఁగెను వ్రణము గుణత మొనయంగాదో.
క. ఆమూలచుంబితం బై, లేమ రదచ్ఛదము పూర్వరీతి స్నిగులఁ
శ్రీమెఱయఁగ సంస్కార, వ్యామిశ్రితమంగళార్థ మన సంశయమే. ౧౬౨
క. చ్యుతసంస్కార మపాకృత, మత మనుకృత మగుట దోషమతి యనుచితమే
యతిచిత్రము మృదుపదమై,యతివకుఁబలుఁదెరయవాక్యమగుటఁదలంపన్.
ఉ. మంకెనపువ్వుఁదేనియలు మాటికిమాటికిఁ గ్రోలి సొక్కుచుఁ
శంక యొకింతయుం గొనక శాతరదక్షతముల్ ఘటింప న
వ్వంకకు డాయుఁ గృష్ణమధుపం బిదె చూచితె నాతి యన్న న
వ్వంకజగంధి మాటుకొనెఁ బంబినభీతిని మోవి కేలునన్. ౧౬౪

క. అలఘువిలాసిత గానా, కలితాజరభాంచితత్వగమకతగా నే
వలసున జంపకమాలా, లలితత్వము నీకునాస లాగెం జెపుమా. ౧౫౫

గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, సవ్యవహితస్ఫురద్రసం బధరమంబుఁ
గైశికీవృత్తి యన నాస గదు వెలుంగు, నొకసరంధ్రత వదలకయుండుఁగాని.

గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు,శంకపడఁజేయ నాసికాచంపకమున
వెడలి మొకరించినిలిచినవిమలమౌక్తి,కంద బింబువు నాయుత్యమంద మొందె.

క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజిప్ప లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జప్యము గాదా, హత్తినప్రేముమునఁ జూడ నర్హము గాదా.

చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరందపాళితో
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నన్వ్వుతోఁ
జెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నాసనా
ఖని యగునాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౫౯

గీ. ఉవిద యద్బాహుసంపాసయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలుగొనుట
వేడ్కఁ గంఠంబుఁ గనఁగ నిర్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౬౦

క. సతి నీమొగాలికి సుదమే, యత యర్హాంబె యొక్కభంగి నది యొప్పంగా
సతిమృదులత సుస్వనతన్, వ్యతిరేకం బనుచుఁ బలుకు నది చిత్రంబే.

గీ. కలిగికలుగమిఁ గలుగఁగదా కంబువునకు, నాత్మనూనప్రబోధంబునందునవుడు
గాన జడమగునది యెట్లుగాంచుసాటి, మాత్మరూపప్రబోధంబునందు మొదకు.

గీ. అర్ధనిద్రాన్వితం బగు నారకంబు, వతివ నీకంధరకుఁ జాల నలికియలికి
యట్టిదానికిసుపమానతాన్వయంబు, గగనకుసుమంబుతో మైత్రి గాంచుసుమ్ము.

ఉ. చుంబితమై రొదల్ నెఱపఁజొచ్చినకంబువు*తోడిసాటి కం
తంబున కందఁజేసెదఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్షంబుగఁ బల్కఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయగఁ బల్క నేర్చునే. ౧౬౪

గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలు(పు), ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్లు తతవాద్యజాతరవము, మధురమేనియవర్ణతమానదెపుడు.

* తోటిసాటి † మచ్చినయూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల నిజముగ, నీ *సరసపుఁగొలికి పెనలు నెఱిపలుకులకున్
దోసము సరియన్న రసా, భాసాస్పదశుకపికాదిపక్షిస్వనముల్. ౧౬౬

గీ. తరుణి తలఁప ననర్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెపయు
మఱియుఁబికమెట్లు త్వద్ధ్వనిసాటి ననంగ, నీకుఁగళసూక్తిపలెనట్లుగొంపుగావు.

ఉ. తావకకంఠనిస్సరదుదంచితభారతి సద్గుణత్వసం
భావిత మైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతన్
భావుకు లెన్నుదోషముల వజ్జ మెలంగదు దోషమూ గుణం
బేవిధిఁ బూన దిష్టగుణమే కొను నంచు వచింతు రుత్తముల్. ౧౬౮

క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీదుకంఠంబునకున్
సా(ర)రసోత్కర్షగుణా, ధారము లగుసువచనములు తగుభూషణముల్.

క. పటుబంధస్ఫురితము లు, త్కటబహురసవస్తుసంవిధానక్రమముల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు సుగుణములు విఘటిల్లునవిగాసొమ్ముల్.

సీ. అనుకరణంబుచే ‡నగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మెఱచి
శబ్దతర్థాస్థపై శారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకుసేసి
యంగాంగితాకథనాదిసాధనముల రసదోషనిచయంబు రాణఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధౌచితీగతి రచనాద్యనర్హత రహి హసించి
రసికు లౌననఁ ద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నానసంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించునంచు, వినికినాకగునదికొల్లి కనుపుసొమ్ము.

చ. అని వనితానురాగరసహర్షసముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డయ్యతివబంధురపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరివాబ్జసంభరణకౌశలహస్తము మెచ్చెఁ దార్క్ష్యునన్. ౧౭౨

చ. కుచపదమణ్డలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము శ్రీరసీరసయభావముతోఁ దిలతంపులక్రియా
ప్రచితము నాచు సద్రసము భాసిలఁజేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭౩

సీ. నిరుపమనానావర్ణచిత్రరుచిరాజి దంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

---

*సరసులకొలికి †త్రుటితనిస్సారరంధ్రము- ‡నవిగృహీసంస్కా--

పత్కీర్ణమౌక్తికపాళి స్రుతతథార పరిణాబింబధారగాఁగ
ముక్తాళిమధ్యగమోహనహీరముల్ లసదుడువర్గోజ్జ్వలములుగాఁగ
లలితరుచివక్త్రశశిమండలంబుడిగుప, దండిమీఱుప హారాధరమండలంబు
మా(మ)కమనోరథచ్ఛలమహితసస్య, ఫలములెల్లనుమిగులనిమ్మన్నములుగ.

క. ముక్తాహారము లిర్వీ వి,విక్తచ్ఛాయలు ఘటిల్లి వెలయఁగఁజేయున్.
ముక్తావద(?) మన్యమణీ,రిక్తత గన నీసముద్ధరించినకృతులన్. ౧౬౫

గీ. పూర్వపూర్వవిశేషత పొసఁగ నుత్త,రోత్తరంబున కిది భూషణోత్తమంబు
నాతి యేకావళీభూషణంబు దీని,గన్నరసికులమది మోద మెన్నఁదరమె.

గీ. రమణి! దీనకభూషణరత్న మిద్ది, మంజులైకావళీయోగమహిత ముకుట
మాలికాదీపకం బాచు మామకీన, మానసము నాత్మనిష్ఠతఁబూనఁజేసె.

క. *అరయు నరసర్వఘుటకం, బుచితరలోజ్జీవితంబు నొప్పగుసుగుణ
స్ఫురణంబున నేకావళి, వరమాలంక్రియలలోన బర్వేందుముఖీ ౧౬౮

చ. సురుచిరపద్మరాగపరిచుంబితనీలనిబద్ధహారని
ర్భరరుచిరాజి వింతకనుపండువు సేసెఁ ద్రివేణికైవడిం
గర మనురక్తి నేరదవగాహన మొందె మదీయభావము
బ్బురమె నిరంతసౌఖ్యరము పొందుట యిత్తఱిఁ గామినీమణీ. ౧౬౯

గీ. లేమ నెలమొలఁ దారావళికిఁ బ్రకాశ,ముబ్బుటరుదని యెంచంగనగునెచూడఁ
దదురురోచుల సనసి యుద్ధతపుఁజక్ర,వాకయుగళంబుజోడయిపజిలవరుచు.

క. లాలితరుచపదమండల,మాలి నలంక్రియలు చాల నొప్పఁగఁ జేయున్
†బాల వీక్షింపు మపమా,నాలనములు పొంపుఁగొనుటమెచ్చ తలంపన్

క. ఇక్కరణిఁ బలికి యనుపతి, చక్కనిరవణమునఁ జిక్కునడలింపుమఁ బన్
జొక్కపుఁబూఁగుత్తుల వై,సక్కొనఁగాఁజేసెఁ గన్ను నాటితుమ్మెదలన్.

క. మించి మహీధరగర్వ ము,డంచుట నిరమిత్రమా మిటారికుచంబుల్
కంచుకకవచం బెల ధ,రించెను గాళింది విస్తరించి తెలుపవే. ౧౭౩

ఉ. రంగు లెసంగుమేను మది రాణపహించుదృఢానురక్తిచేఁ
బొంగఁగఁ దర్పులంబునన పుట్టినతత్తనుకంటకంబు లె
క్కం గడుదుర్బలం బగుచుఁ గాంచనకంచుక మిద్ది పక్షునన్
భంగముఁజెందెఁ గన్గొను తుభంగురలోలకటాక్షవీక్షలన్. ౧౭౪

*అరస †బాలాక్షిం-

గీ. చక్రవర్తిత గాని యరిచక్ర మణఁచి, కటుమహాభోగమున నురోభద్రపీఠి
రాణఁ జేకొనుభూధరరాజములకుఁ, గోకచాటున మెలఁగంగఁ గొదవగాదె.

క. ఎడకు డిగి కూడ దు ఖళకళి,నడఁచి జయింపంగఁ దలఁచు ననుచును జెలువా
కడుఁగంచుకజాలములోఁ, బడనిడి కుచకోకములను బంధించితివో. ౧౮౬

శా. కాంతాపీనకుచంబు లాకృతిచమత్కారంపుగూఢధ్వనుల్
కాంతాసన్నిభపఙ్క్తినం చొగి నలంకారజ్ఞు లూహించదృ
ష్టాంతవ్యాప్తి సార్థకంబుగ మదిం జాల న్విచారించి యో
కాంతారత్నమ కంచుకాకృతిఁ బరిష్కారించితే గుబ్బలన్. ౧౮౭

గీ. నడు మనెడుమిన్నుపైఁ దవ మెడయు కెనయ
ఘనఘనత్వంబు ఫలమయ్యెఁ గాని సూక్ష్మ
సూక్ష్మత ఘటిల్ల దని లజ్జ సొగియ అవిక
చాటు కుచమందె నో యది సంది నరుదె. ౧౮౮

మ. అతిసూక్ష్మం బగుటన్ రహస్యతమమే యౌఁగా స్వరూపంబు మా
నితిగా దానిఘనాంగతం గొనుచు మన్నింపంగదా సౌఖ్యముల్
సతి నీగుబ్బలు గొప్పగొప్పలగుఁగా స్వాయత్తసంరక్షకై
యతిగోప్యాకృతి మాని యుంచు టరుదా యాత్మ న్విచారింపుమా. ౧౮౯

మ. అలగూఢధ్వనికి న్నిదర్శనము దా నాచుం జెలంగుంగదా
బలుచన్నుంగవ మున్ను నే నిపుడు తద్భావంబు నైఁవ న్మను
జ్జ్వల*రీతిత్వము నీవు మెచ్చుకొన సంపాదించెద న్గంచుకా
కలనం బాఁపు చగూఢమైనధ్వనితో గారాపుసాదృశ్యమున్. ౧౯౦

గీ. అనుచు హృద్గతతద్గ్రంథికపుసువికల, భావమునగూర్చికంచుకావరణముడిపి
పరమకారణ మగువేల్పు బయలుపటిచె,సత్కుచాత్మస్వరూపంబుచాలఁ బ్రీతి.

క. కలికి చినవాఁడు చేరికి, బలుగుబ్బలి మేలుపూలబాతి యగుంగా
యలచేతి కిపుడు కుచమిది, బలుకొండై మేలపూలబంతియు నయ్యెఁ.

గీ. మేలుబంతుల నల్లను గేలిసేయుఁ
బ్రాయమెక్కినకొలఁది నీబలుకటికిత
నంబు గొను సూక్ష్మమొక్క గుణంబు సొరగ
నెనయు దపకాళసద్వృత్తమెట్లు కుచము. ౧౯౩

---

*రీతత్వము

కాళిందీకన్యాపరిణయము.

ఉ. కొండలనైన శేఁతవిరిగుత్తులకైవడి మీఁట రాజవే
దండముగండముల్ విరియ దాఁకఁగ దక్షతఁగల్గి మీఁటి యొం
డొంటిని డాసి మా తెలుఁగుకొండడు కోడెమిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మయ్యెడుసూత్ర మదెద్ది తెల్పవే. ౧౯౪

క. పాలిండ్లే మరగి తిరిగి(తి,) హేలావతి(చి)న్నయప్పు డిప్పుడు నీమే
ల్పాలిండ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియింపంగన్.

గీ. మగువ ! యేతత్పయోధరమండలంబు
బర్హిధరహర్మ్యత్వమోదంబు బలియఁజేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బర్హిభృన్మోదహేతువై పరఁగుటరుదె. ౧౯౬

క. గురుశుశ్రూషణ మవశ్యం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గురు(వ)కుచరశుశ్రూషన్, సిరితీఱయసుఖంబు మాకు నలకొనదె చెలీ

గీ. అదరి ద్విజరాజచక్రంబుఁ బడఁజేసి, మృదులతరసుమనఃపంక్తు లోడఁగఁజేసి
మిగులనుద్ధతిఁగొన్న నీ మెఱుఁగుగుబ్బ, మగువ మర్దింపఁగ మాకు మానఁదగునె.

సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరువత సాదృశ్యహేతువై చాలఁదోఁచుఁ
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడుశంక
బలుకుచంబులఁ పూలబంతులైన మృదుత్వ మచ్చటఁ గారణం బనెడు తెలివి
వివరింపనత్తెల్వి కిషమతకవకాశ మంబరకుసుమంబ యనెడు మనసు
కేలఁగైకొని మదిఁ బరీక్షింపఁ దెలియుఁ
బరుషభావమృదుత్వ*సద్వర్తులత్వ
పీనతోన్నత్యములఁ గొన్నిభేదము లిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧౯౯

మ. బలుకొం డొక్కటి మన్న నాకరమునన్ బాగైనపూబంతివా
విలసించెం గద మేల్కుచంబు లివి యీవేళం గరాయత్తతే
న్వెలయ న్మార్దవమేని తత్సదృశత న్నిర్ణింతు సత్కొండ క
న్నులఁపొడ్పన్ జనియించె నంచు హరి మిన్నాగుబ్బ లొత్తుం గడున్. ౨౦౦

గీ. అతికఠినపీనవక్షోజహద్వయీవి, మర్దనము చేసి చేసియు మఱియు మఱియుఁ
గాంతుఁడదునాదుహృక్కహస్తకంజమింతి, చిత్రమిదియనికుచపీడ చెలఁగిచేయు.

---

*సద్వృత్తత్వ-

సీ. జోడువాయకకూడి జొబ్బిల్లెడు సుగంధభూరిపంకంబున బ్రుంగిబ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల నలరులీలల వాడ నాడియాడి
గురుతరమత్తేభకుంభస్థలంబుల నతినాక్రమింపంగ నిక్కి నిక్కి
యతిఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దడయక తత్పద్ధతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర జొక్కుచు జక్క నిలుచు
కుచకిశోరంబులను జూచి కోర్కి మీఱ
ముద్దుగొన *మనసుపుట్టెను ముదిత యనుచు
ముద్దుఁజనుదోయి శ్రీపతి ముద్దుఁగొనియె. ౨౦౨
గీ. చంద్రుఁ డొక్కఁడు బాధింపఁ జక్రయుగళి
యింతముఖ నీదుగుబ్బలై యొనసి యిపుడు
చూడు బహుచంద్రభూషణస్ఫూర్తి మయ్యె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁజేసె ౨౦౩
క. నెల యొక్కఁడె చక్కవ, లలికుంతల నీదుకుచములై జనియింపం
గలిగెఁ బహునఖచంద్రా, కలితతతిపేర యని నఖంబులు నాటెన్. ౨౦౪
గీ. సర్వగురుచిహ్నములు గానిచన్నుదోయి
సర్వగురుభావ మెఱుఁగంగ శక్య మగునె
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల బాలేందురేఖ లిడియె. ౨౦౫
క. హరినఖపదచిహ్నిత మా, సురుచిరకుచకుంభయుగళి చూడఁగనొప్పెన్
వరశుకశితముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬
చ. గిరులకుఁ జిత్రపత్త్రలత గీల్కొను టబ్రమె కప్పురంబుచేఁ
గరము మెఱుంగులీను మృదుగంధ మలందఁగఁ జేసి తెల్లడా
ల్గిరులకు సాటిఁదెచ్చి యటఁ గేళివసించు శివుండ నయ్యెదం
దరుణి యటంచు నించు హరి తత్కుచసీమ సుగంధపత్త్రముల్. ౨౦౭
చ. శుకము మహాగమాంతరతిఁ జక్కిక నింపగు దాడిమీఫలం
బకట పునర్విదారణము నందెడునట్లు ప్రయత్నమూనె నా
పికము సమందహాసమయి ముద్దులు గుల్కఁగఁ గొమ్మపైఁడిడా
ల్చకచకలూరుపయ్యెదను జక్కఁగఁ గప్పెను జొమ్ముఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసుపుట్టెడు.

క. అతిశయితోన్నతవృత్తిఁ, బ్రతిలేకుండియును మధురరసమేరీతిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలువున్.

క. గేయ మగు చేరగురుతోఁ, న్నయమై సర్వవృత్తనిచయాద్యంబై
పాయకు గా శ్రీవృత్త, శ్రీ యూరుజయుగము శృంగారవతీ. ౨౧౦

క. వరుసంబు లగుటఁ గుచకుంభ, సరళి బులు గాక యున్న సఖ చిత్రంబే
స్థిరము లగుచున్న వబ్రము, వరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున మెలఁగు చెలువౌభూవల్
శ్రీకర ముభయశ్లేషమె, కోకస్తని చాలఁజాల గుఱుతుగఁ గంటే. ౨౧౨

చ. మదభిమత(ంపు)శయ్యయయి ఘూనితభూషణమై యదోవమై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుచద్వయి చిత్ర మొక్కఁడే
సదమలగాత్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి పొరంగ నంది యటఁ గానఁగ శక్యముగాదు చూడఁగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతివారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుమీా లడరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాలమై
యలరెను బాహుమూలముల కర్షము ఖాతము లేవ పూతచే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క సఖంబులువాఱఁ గనుఁగన్
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దా నిడన్. ౨౧౪

క. అరుఁగనుఁగొనిరొ శ్రీహరి,యారుచి ముద మొనరఁజేయు హారిరత్నపుమే
ల్చేరుం జలిచీమలబ, ల్బారుం గలహింపఁ బిలుపఁబంపెదుదాన్. ౨౧౫

గీ. విన్నకానునఁ బొక్కిటివేల్పుబావి, లేమ యాచెంత మధుకరాలీఢమగుచుఁ
గలదు పేశలరోమాళికల్పవల్లి, విబుధవరు లగుమా కొగి వేడ్కఁజేయు.

గీ. అతివ యున్నంతమేనికి సహివరేణ్యుఁ
డభిమతంబైన తల్పమై యలరఁజేసి
యిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకరాబ్జ
మునకె తా శయ్య యగుచుఁ బల్మిడ మొనర్చు. ౨౧౭

క. మాయానరేంద్రహస్త, చ్ఛాయల రోమాళిభుజగచంద్రుఁడు మిగులం
బాయవహించెను జిత్రము, ఛాయాసుత నీకుఁ జూడఁ జనదే చెపుమా.

గీ. పరమబంధమయం బౌటఁ బరఁగుగాఁడ, రీతినో లతను జనుదోయి లేమ యట్లు
గానరోమాళి యనుపేరుపూనుచీమ, బారువయి కెక్కు నాభిగహ్వరము వెడలి.

ఉ. పొక్కిటికోమనుండి వలపుంగిరులంచుఁ గుచంబు లంటఁగా
గ్రక్కున నిక్కు నీలఫణిరా జొకొ పొక్కిటిపాదునుండి పెం
పెక్కఁగ నిక్కుచుం బయట నెంతయు స్రుక్కుచు గబ్బిగుబ్బలం
జొక్కపుఁగొండలం చడరి చొప్పడు తీవయొ యిద్ది దెల్పవే. ౧౨౧

గీ. రమణి మంజులరుచిరోమరాజిభుజగి, తరుణకృష్ణభుజాదంశద శశాంక
రాజు తనుగూడ నంతే నిరమణఁ గాంచెఁ, జాదితే ముద్దుఁ దెలితేటమాపులాఁడి.

కం. ఆతల నీతల దేశము, లేతఱినైనం సమృద్ధి నెనయఁగ తోమా
పేర మగు మధ్యదేశము, ఖ్యాతిగ నిట నహిభయంబు కలుగుటకతనం.

కం. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాదుపాదగతి మర్దింపం
జాలితిఁ గరమున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గదఁగితిఁ బెదురం. ౧౨౩

కం. అందఁగొనువారి భూధర, మండలవతు లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెండులేమిడి, యందగువారల*న బీసయంటఁగ సాగం.

గీ. కన్నరో కంటివే నీమచిన్ననడుము, మిన్నుముట్టినకలిమి చేకొన్నదని
తొన్న నబ్బుర మిద్ది దానున్నదిక్కు, నట్టి నెఱివాదులకు నేని యొఱుగనీకు

ఉ. ఉరుకుచభూధరంబులకు నొప్పుగఁ బ్రాకులతానుకత్రముల్
కరముదలిర్పఁ బొక్కిటిచొకాటపుఁబొడ్డనబావిలోని యా
ద్యరసపు జాలనా మిగుల నందముఁ జెందెడు రోమరాజి యం
చరుదు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డారొగిఁ గేల నంటుచుం. ౧౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వెల్వడి మీఁదికి వేగఁ బాఱుమే
ల్చిప్పరసంపుజాలుగద గట్టిగఁ జొక్కపురోమరాజి యం
దొప్పగు లేఁదరంగలర యూర్ధ్వగతదంతుర రేఖలోకదే
యొప్పులకుప్ప యీవళులు లవో యని మాటికి నంటు మువ్వళిం. ౧౨౮

గీ. కాదు భావంబు దృష్టికిఁ గానరామి, పటుకుచద్వయిఁ బూన నభావ మెట్లు
నాతియటుగాన నుభయభిన్నంబు కాను, మత్స్వభావంబుగనుట చేమాకుముద్దు.

కం. సర్వద్రష్టను నేనను, గర్వం బిఁక మానుఁగలదె కనుపట్టదుగా
సర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళసంగత మయ్యుం. ౧౩౦

*సవీడ కట్టగసాగం.

గీ. సత్త్వ మొనగూడకున్నను జాన నడుము, విష్ణుపదపదమయ్యెడు విరుసుపిదప
విష్ణుపదపదమయ్యెడు విధము లేదు, సత్త్వ మొనగూడననినవ్వుఁ జక్రధరుఁడు.

కం. ఘనజఘనకుచపదంబులు, కనవయ్యెను గురువులగుచుఁ గమలదళాక్షీ
కన వింత మధ్యపద మిది, కనుపట్టెను లఘువిలాసఘటితం బగుచున్.

సీ. బలుకొప్పు కార్ష్ణ్యగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనరారుకుచపర్వతంబు లూని
తన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మ మై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తవమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మును విష్ణుపదతఁ గాంచు
నిపుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావ మని కానుఁ బిడికిలించు. ౨౩౩

గీ. వెలఁది తారుణ్యరసమహావేణి యందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
నతిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదు పడఁతి నాభి.

చ. కలితతనూలతం గలవికస్వరనాభిసుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వాలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొనవనారణమైఁ బయికెక్కుఁ బిల్లతేఁ
టులజిలిబారునాఁ జిగిఁ గనుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪

గీ. కాంత యేలోకముననైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁ డగునె
యిప్పు డీమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహంబు. ౨౩౫

కం. శృంగారరసం బిచ్చటఁ, బొంగదె మధురంపుగుణము పొలుపారఁగ నో
యంగన మధ్యమవృత్తిక, సంగదె మాధుర్యగుణము సంశయ మేలా.

కం. పునరుక్తిపలెను నుడికిం, గనవయ్యెను నాభి మించు గడుయూపము నం
బునరుక్తవదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక నందుట లేదే. ౨౩౬

గీ. పంకజాతాక్షి యీకరపంకజమ్ము, పొరిఁగిఁ దలఁచెను దాఁబరసుఖముఁ గోరి
చెలువుమీఱెను నిమ్మహాబిలబిలంబు, నన్యకార్యసమాసక్తి యంత వదలి.

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజం *బాత్తాయతాంచత్కరం
బెలమిం జాఁచుచుఁ గ్రీడసేయఁగద కృష్ణేభంబు కాన్నింట నీ
చెలువంపుంబలుదిగ్గియం బ్రమదియై చేసాఁచి క్రీడింపఁగాఁ
దలఁచెం జూదితె యంచు నాభికడకుం దార్చెం గరాంభోజమున్. ౨౪౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బవుఁగదా యిప్పాణ్యు నీడ్చింపఁగా
వదల న్నె నొకలత్యమా యతనికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత నాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గడుం
జెదరె న్నీవి మనోహరాంగి కనుచుం జిత్తంబులో నెన్నవన్. ౨౪౧

క. ముడితోడన వడిమీఱఁగఁ, గడుసాగెఁ గటి నెసంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పుధైర్యపు, ముడి సాకల్యంబుగాఁగ మ్రుద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహాత్ముఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మపృథులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనా
మొత్తఁగఁ జేసి నందిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యముసగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౪౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల, నొవ్వుచుఁ బుష్పాయుధుండు గువ్వుచుఁ దిరుగన్
దువ్వుచుఁ గటిపై †బాపులు, రువ్వుచు వెన్నుండు తిగ్మరుచినుతఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలామాయావిచిత్రత మనుటకతన
సూక్ష్మాతిసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రయతచేఁ బరఁగుకతన
నంత(టం) దనరోచు లడరించుకతమున నర్ధ్వాజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటిసుప్రపంచంబు గ్రమ్ముకతనఁ
దరుణి మామిత్ర మిమ్మహాంబరము గానఁ
దనకుఁ దా విడి మాకుఁ హితం బొనర్చె
మేము చేసినదని గాదు లేమ మాకు
నేర మించుకయును లేదు నీవు గినియ! ౨౪౫

గీ. భామ కర్ణావతంసాదివదములందు, జఘనకాంచిసమానగజఘనపదము
గణితమై యున్నదో కాదో కలిమి లేమి,నీ వలంకారవతివిగా నిశ్చయింపు.

క. విరసంబై కనుపట్టెను, సురధునిసికతామయంబు జోడనఁ దగు నే
వరమాద్భుతసుమమారవ, మిరవొందఁగఁ గాన నైనయాకటితటికిన్.

---

* బాత్మగతాంచ †మాపులు

గీ. అతివ కాంచి గుణస్థాన మగుటకతన, నేతదుజ్జ్వ వరదరాజేష్టవాస
మెట్లు గాకుండు నిటవసియించునట్టి, పరమపూరుషు వతనుతాపంబుగోను న
గీ. దామ యీకటిభూధరచంద్రమునకు, లీల భూచక్ర మంతయు నేలఁజాలు
భాగ్య మొనగూడ గిరిదుర్గపాలనంబు, పులినదేశంబు నేలు టబ్బురముగాదు.
క. ఈకాళిందినితంబము, జోకై యాక్రీడ నమరఁ జూపెను మదిలో
నాకాళిందిమనోజ్ఞత, రాకృతిపులినస్థలీవిహారము లెల్లన్. ౨౧౦
గీ. అపదసౌందర్యమై కటి యపహసించుఁ
బ్రాకృతవ్యాకృతిని జిత్రరసముదోఁచు
నొక్కయెడ నద్ది పురుషత్రయోజ్జ్వలంబు
ప్రథమపురుషైకసంస్పర్శభవ్య మిద్ది. ౨౧౧
గీ. కటిపదంబున *నర్థసంఘటిత మగుచు, జఘన మభిధకు సాటియౌ నన్నితంబ
మూత్తమశ్చాన్నిరూఢిమై యందులకును, నాభిమూర్ధ్యంబు రుచిగాంచి వ్యక్తిఁ బోలు.
క. నిరుపమసంభ్రమ మొదవఁగఁ, గరిగామిని కుందితంబు గావింతు నిటం
బరమావ్యాతరస మొదవఁగ, వరవు దలిర్పంగ †నే వివృతమొనరింతున్.
సీ. పొంగుచు నీకటిరంగస్థలంబున లేమ చక్రభ్రమరిం ఘటింతు
ననుమోదభరమున నంబుజలోచన లీల ఛత్రభ్రమరిం దనర్తుఁ
గువలయేక్షణకోర్కి గొనలుసాఁగుచు మీఁఅరుద్వృత్తముఁ జాలనొఅపుగాంతు
సురుతరమై రాగ మొదవ నున్నతవేణి రథచక్రచారిత రమణనింతు
నతివ యిట్టు హరిక్రాంత హైమయసంగ, జతనపడుచును వైష్ణవస్థానమై పొ
సంగ‡ వ్యాకృతినొందఁ జతురవృత్తి, మెఱయు నీవేళ నీచేత మెప్పుగొందు.
క. ఈరీతి వచింపుచు హరి, చారుదతీపీనజఘనసంగమమోదా
కారపయోనిధి నీఁదఁగ, నరీతి న్వాఅపురేక యొదమెలఁగంగన్. ౨౧౪
క. ఊరువులందుచుఁ దగ్గత, చారుమృదుత్వంబుఁ గాంచి సరసకదళికా
కారంబు లధికకఠినవి, కారము లని మనసు సౌఖ్యఁగా నిట్లనియెన్. ౨౧౬
గీ. లలన(నీయూరు) యుగళిపేశలతవలనఁ, బరిభవముఁజెందఁ గదళి కాతరుపనంగ
నయ్యె నచ్చట నమనవార్థాంతరంబు, లోకవిభ్రాంతిమూలంబు గాకయున్న.
గీ. తరుణి యూరూత్తరపదోజ్వ్యాధాయకత్వ
మొందు యోగంబునఁ ద్వదూరుయుగళపర్వ

* నర్థసంఘటిత † నేలిప్తత్తమొనర్తున్. ‡ వ్యావృతిగొందుజ

దానఁ గనఁడయ్యె ముని త్వరితంబుకతన
సభ్రమే వార్త్తికోక్తుల నతఁడు గొనెను. ౨౫౮

క. అని యాగద్వయిపొందిక, ననితరసాధార(ణ)ంబు హర్షముగొనుచుం
గనకపుటొల్లి యు వేలుపు, కనకాంగిపదద్వయంబు గనుఁగొను చనియెన్.

గీ. అంతజంఘా(?)సద్వృత్తియై చెలంగి, లలితవర్ణోయరీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీను నలంకృతధ్వనులఁ దనరి, రమణి సొగసైన యాపదరచన వెలయు.

గీ. హరికరస్పర్శనంజాతహర్షవిభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదములసేవ లాగుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు.

మ. అను చంఘ్రిద్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పనసత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రయం
బన కాంతేవడి మీఁటి శ్రీధవుఁడు ప్రోయాలిం దగం గాఁగిటం
జెనయం జేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౨౬౨

చ. అతినిశితంపుటగ్రముల నందెను బల్చనుబొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పదురంబు నురంబు(దాఁ)కినన్
క్షతి యొకయింతలే కదరుచక్కనిగుబ్బలు రెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కఁడొక్కటికిఁ బాయనిసాక్షులు యుక్తయోగముల్.

గీ. ఘనలసద్వంశములఁబుట్టి జనులొనర్చుఁ, ఛిద్రముల కోర్చి శుద్ధనిర్ఛిద్రవృత్తిఁ
జాలరాఁశిల్లు మేల్ముత్యసరులు విడుచు, సద్గుణంబుల నుద్ధతాశ్రయముకతన.

గీ. అంతరం బగుసార మావంత లేక
బయటఁ దెల్పులఁ గొన్న యాస్పదముగన్న
నొక్కతటి హాని యగు నని యొప్పఁ బలుకు
చతులహా(రా)ళిసూత్రంబు లపుడు విరిసె. ౨౬౫

గీ. ఛిన్నసూత్రంపుముత్యముల్ చేరువేళ, నవ్యనక్షత్రమాలిన్ను నవ్వఁ గాదు
ముత్యములు నాభిసరసికి మొనయునపుడు, తరళరోమాధరగళదుదస్రకములయ్యె.

ఉ. కంచుకనామసత్త్వపచగర్భగతత్వ మఖండసారభా
వాంచితులైనవారలకు సర్వముగా దని పీడనాడరే
కొంచెపుఁబూఁత తోడగున కూమున కీర్తులు కార్యవేళ నం
తొంచి కుచంబుపూఁత నెడయించె ననం గడుపీడెఁ బూఁతయున్. ౨౬౭

*దొక్కఁడొక్కటికి

క. బలయుతు లన్యోన్యంబును, బలవత్సంఘర్షసేయ బలమటి నడుమన్
మెలఁగెడునది చెడు ననుచుం, దెలుపుచుఁ గుచపత్త్రకాళి దెరలెన్నిగులన్.

మ. పరిదత్తర్షము ఘోరదోషగుణసంబంధాభిజ్ఞత్వసం
గత మౌదార్యసుకాంతిముఖ్యగుణసాంగత్యాభిరామంబు నా
సతిచక్షుర్దోయి యలంకృతాన్యమయిగాన్ సత్త్వాన్యముంబోలి శ్రీ
పతిచిత్తాబ్జమునం బ్రమోదభర మాపాదించె నెంతేనియున్. ౨౬౯

వ. అంత ననంతలీలావతారుఁ డగు నారాయణుఁ డమ్మానవతీరత్నంబు నయత్నాయత్తాసాధారణాంగన్యాంగలావణ్యం బనిదంప్రథమపరిదృష్టం బయ్యు నిదంప్రథమావలోకనసంపాదితానుపమానకుతుకంబు మనంబునకు *నాపాదింపం దలంపులోఁ గిబ్బరంపుటబ్బురం బాగుబ్బుకొన నోయలినీలకబరీ కబరీభారంబున నుదాత్తాలంకారంబును గలితాలికాలకంబున వక్రోక్త్యలంకారంబును గమలాననంబున వికస్వరాలంకారంబును గన్నుదోయి నుత్ప్రేక్షాలంకారంబును గలికానాసిక లలితాలంకారంబును గపోలయుగళిఁ జిత్రాలంకారంబును గర్ణంబులఁ గుండలీబంధాలంకారంబును గన్నుబొమల దృష్టాంతాలంకారంబును గమనీయాధరంబున రసవదలంకారంబును గంబుకంఠంబున నత్యుక్త్యలంకారంబును †గనకకుంభకుచంబుల ‡శ్లిష్టరూపకాలంకారంబును గనద్బాహుల మాలికాబంధాలంకారంబును గరతలంబులఁ బద్మబంధాలంకారంబును గప్పునూగారున నాగబంధాలంకారంబును గనకచ్ఛాయంపువళుల విషమాలంకారంబును గౌనుదీఁగె సూక్ష్మాలంకారంబును గభీరనాభి నతిశయోక్త్యలంకారంబును గటితటుల సారాలంకారంబును గరభోపమోరుల రూపకాతిశయోక్త్యలంకారంబును గాదిలిజంఘల ననన్వయాలంకారంబును గలపదంబుల విరోధాభాసాలంకారంబును సర్వాంగంబుల సమాలంకారంబును ధరించునించుఁబోఁడివి గావున నానాలంకారలీలామాలాస్పదంబ వయి వెలుంగెదవు గావున ననుపమవేని నుపమవగుటకు సంశయం బాశయంబున నుదయింప నేర్చునే యనుచు నగుచు నవ్వారాశోహాసిజకటులెంపివిశాలదోరంతరారోహం గావించి చాఁ బ్రొద్దు పుచ్చుకొన నంతరంబ. ౨౭౦

* నాసాదింప † ఘనకుచంబుల ‡ శ్లిష్టోపమాలంకారంబు

సీ. చలిగాడ్పుచేఁ దీఁగబలెఁ దేటనెన్నైన వలువలు జలజలంబలను రాలఁ
గొప్పు చక్కఁ గుదుర్పుకొనఁ గవకాంతులు పొంత బంగరుజలపోఁత లీన
నిదుర చాలనియట్టినలినలోచనంబులు తత్తాలజలజంబుఁ దప్పుగొనఁగ
మిగిలెడునసురక్తి మగుడిచూపఁగఁ జాది మదనుండు కాలూన మనసువడఁగ
పార్ధరస మున్పఁ గాల్యభయంబు నడుగ
నలసయానంబు పాదంబు లడుగు లిడఁగ
నంత యిం తనరాని యోయూనవడఁగ
బొడగువగలాఁడి వచ్చెను బ్యాకలి వచ్చె. ౨౭౯

క. అతిసూక్ష్మాంబరశోభ్యా, గతకృష్ణఘనాంగ మెకసి కమలేక్షణ దా
నతిమందయానమున *రా,నతిభద్రతటిద్విలాస యగుచుం బొలిచెన్.

క. అనలంకృతయానము గొని, వనజాయతనయన యపుడు వఱలె ననంగాఁ
జనదే వస్తువ్యంగ్యం, బనలంకృత మైన మోద మచ్చట లేదే. ౨౮౦

గీ. అతనుభూషణవిస్ఫూర్తి నందితోలుత,సుతనువు తనూమతల్లి కసాగనుపూను
నతనుభూషణవిస్ఫూర్తి నందకున్న, నతనుభూషణవిస్ఫూర్తినలగె నపుడు.

గీ. సుప్రసాదత సద్వ్యక్తి సుభగ యగుచు
ఘనతరాలంకృతిస్ఫూర్తి గొనక మగువ
యుత్తమంపుఁగృతి న్నగు నొక్కవింత
యొక్కయెడ సంస్కృతిచ్యుతి నొప్పు మిగుల. ౨౮౨

సీ. సానపట్టినయట్టి జలజాతబాణుని చేతిమిన్నా హేతిఁ గనకు దానిఁ
జారుపుంస్కోకిలాస్వాదితం బైనట్టి క్రొమ్మావినిం దప్పు గొనెడు దాని
సంతతరాజహంసక్రీడితం బైనకమలినికై బొమ్మగట్టుదాని
మలయానిలాక్రాంతమర్దనక్లాంత మా సుమశాఖఁ జులుకఁగాఁ జూచుదాని
దవనమునఁ జాది ద్వారంబు దాఁటువేళఁ, దోడినచ్చెలికత్తెలం తోడవచ్చి
బిగ్గఁ గౌఁగిటఁ జేర్చుచుఁ బ్రేమమిగుల, మేలుగాఁ బల్కె నొకవాణి నీలవేణి.

ఉ. కోరిక దీరఁగా మగనిఁగూడి సుఖించిననిన్నుఁ జూచినన్
మేరకు మీఱుమోదమున మేను సుఖించె మనంబు చింత మా
కూటఁడ నీవు సెజ్జకడ నుండి కటాకట తోడులేక యీ
ద్వారముదాఁక నిట్లిటకు వచ్చితివమ్మ భయంబు దక్కుచున్. ౨౮౪

* దానతిభద్ర-

ఉ. అంతట నింతిరో యెత్తి నగ వానన మాతులొనంగఁ బల్కు నీ
యింతికిఁ దోఁచు గావలెన యిక్కడ కక్కదరుండి రాఁగనా
వంత భయంబు లోఁగొనక యాత్మవిభుం దనుదండ నినిశం
గంతురంబుఁ జేసి తలిగాయము లందినమేటి గావునన్. ౨౮౫

చ. అప్పుడు నీలవేణి చలియందపుఁ జేష్టలు చూడఁగోరి యా
యొప్పులకుప్ప నీరుమది కొప్పుగ జేఁ దలపూన్చిఁ బూననే
తప్పక చెప్పు మన్న నగుఁదాల్చుట సిగ్గున మోము వాంచుటం
జెప్పెను నాతి యంతరము చిన్నలు చెప్పఁగఁ జానరుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీకుళిందదిఖరం గరగ్రహణంబుచేసి యనంతరంబ మిత్రవిం
దాకుందరదనం బెండ్లియాడి నాగ్నజితీనామవతిం జెట్టవట్టి భద్రాభద్రే
భయానం గాలుగ్రొక్కి మద్రరాజన్యకన్యక నైనలక్షణకుం బొట్టుగట్టి
యష్టమహిషీనయనచకోరకరత్నాకరుం డై యక్కటయాతనవ
గుండు పిదప నరకాసురుం ద్రుంచి [యింద్రలోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం ద్రుంచి] తత్కా
రాగృహానీతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్భావతనిరంతరప్రమోదాపాదనదక్షుండగుచు దక్షిణుండై
గీరలలితనాయకోత్తముం డనవెలయుచు మునులకుఁ దపఃఫలంబై యరి
నికులకుఁ గృతాంతుండై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రసరుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుండై సంఖ్యావంతులకు శాస్త్రవేత్తయై
నటులకు వాల్లీసకతల్లజుండై కర్షకులకు ననుష్ఠాతృప్రకాండుండై తత్త్వవా
దులకుం బరమతత్త్వంబై యోగీంద్రులకు లక్ష్యంబై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యంబై భాసిల్లుచుండ నయ్యావ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి ననుష్ఠానకత్వవిలాసభాసురంబై చాల వాసిఁగాంచ
దా(హాకరో)దారదవకేలి వంధ్యాకుమారునితోఁ బొందు గోరకొనిడు

---

[ ] ఈ గడిమి వాక్యము సందర్భశుద్ధిగా లేదు *శాస్త్రంబులీల-

దారిద్ర్యఖేదసంధానంబు గగనమండలపుండరీకంబు చెలువు మీఱ
శశిమృగంబుశిరంబు చక్కఁ ద్రొక్కి మెఱుంగు కొమ్ము స(వర్ధ)ర్థి మిమ్ముచేసె
నవనినాభాఁ గోపాల మఖిలజనుల, నలువుమిగులంగఁ బ్రాపించె నవరసముల
నలప్రసాదంబు పొందెడు ననువుగాఁ గ, నతులసౌఖ్యంబు చూపుచు నలరుదుగనఁ గ.

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జ(జ)ప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తిహృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రభమూర్తికి రామమూర్తికిన్. ౨౮౯

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపాకటాక్షసంపాదితపాండిత్యాభరణ ప్రథం
జనవంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణ శశాంక
అభినవనన్నయభట్టారక హోబలపత్యాహ్వయ
కవిమహోపాధ్యాయభట్టారక విరచితం
బైన కాళిందీకన్యాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును షష్ఠాశ్వాసము.

---

ద్వితీయభాగము సంపూర్ణము.